

Salil Choudhury was arguably the most versatile musician in the world of Indian cinema. His meticulous attention to details, a great ear for the lyrical content, an insatiable desire for improvisation, all combined to give his music an ethereal feel. A tribute to a man who wanted to make music that "shall transcend borders - a genre which is emphatic and polished, but never predictable"

# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think." — Dammapada.***

సంపుటి 7 అక్టోబర్ 1995 సంచిక 75

సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం :

వటపత్ర శాయి

Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 033 Ph. 247717

ఎం ఎన్. రాయ్, స్వదస్తూరి - సంవత్సరం 1925

July, 2

My dear Jack H.

From the card sent yesterday you must have judged where I am. Some business brought me to this country for a few days. I will be through in a day or two. Then I will start for your country where I expect to reach Sunday. Hope [illegible] well meanwhile.

Enclosed are some documents which I will need while in your country, but dare not carry along. Please hold them till I come. I am expecting to meet some friends from England at your place. They will report to you on arrival. In case they come before Sunday, tell them that I am detained a day, [illegible] and that they should wait.

Greetings to all the Comrades

M. Roy

# ముగ్గురు తత్త్వవేత్తలు

- ఏటుకూరు బలరామమూర్తి

గ్రీక్ తాత్విక చింతన అనగానే గుర్తుకొచ్చేవారు ముగ్గురు . సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్

వీరిలో సామ్యాలు చాలా వున్నాయి. అందరూ భావవాద శాఖకు చెందినవారు. ఖచ్చితంగా చెప్పాలంటే భౌతికవాద శాఖకు చెందనివారు. అందరూ రాజకీయ జీవితాన్ని ఆదర్శవంతం చేయాలని ప్రయత్నించినవారు. ఈ ప్రయత్నంలో ముగ్గురూ విఫలమైనారు.

నాటి గ్రీక్ పాలకవర్గం సోక్రటీస్‌కు మరణదండన విధించింది ఏథెన్సు నుండి పారిపోయిన ప్లేటో సిసిలీ ప్రభువుచే బానిసగా విక్రయించబడ్డాడు. అరిస్టాటిల్ ఆత్మహత్య చేసుకున్నాడు.

సోక్రటీసు ప్రియశిష్యుడు ప్లేటో ప్లేటో రచనల ద్వారానే సోక్రటీసును గురించి ప్రపంచం తెలుసుకుంది. ప్లేటో శిష్యుడు అరిస్టాటిల్. శిష్యులు గురువులను మించి ప్రశస్తి పొందినవారు.

సోక్రటీసు క్రీ.పూ. 470-399 సం.ల మధ్య జీవించాడు అనగా 71 సంవత్సరాలు.

ఏథెన్సుకు చెందిన కవి అగధాన్ ఇంట్లో ఒక విందు జరుగుతున్నది. అనగా పానగోష్ఠి. కవులు, తత్వవేత్తలు చర్చిస్తూ ద్రాక్షరసం సేవిస్తూ తెల్లవార్లు గడిపారు ఆఖరున సోక్రటీసు మాట్లాడాడు

''దివ్య సౌందర్యం కొరకు ప్రత్యగాత్మ అనుభవించే నిరంతర తపన ప్రేమ. ప్రేమికుడు సౌందర్య ఆరాధకుడే కాదు. సౌందర్యస్రష్ట. తల్లిదండ్రులు పరస్పరం ప్రేమించుకుంటూ సంతానం ద్వారా అనంతత్వంవైపు పయనిస్తారు ప్రేమ అనంతయాత్ర, దివ్య సౌందర్య ఆకాంక్ష'' అంటూ ఆయన ముగించాడు ఈ లోగా అందరూ నిద్రావస్థలోకి వెళ్ళారు సోక్రటీసు మాత్రం ఆఖరు గ్లాసు ఖాళీచేసి, ఏథెన్సు నగర వీథులలో తత్వప్రచారానికై వెళ్ళాడు.

సోక్రటీసు తండ్రి శిల్పి. తల్లి మంత్రసాని. తాను మానసిక మంత్రసానిని అని సోక్రటీసు అనేవాడు

''ప్రతి వ్యక్తి తన మనస్సులోని ఊహలు బయట పెట్టేందుకు తోడ్పడటమే నేను చేసే మంత్రసాని వృత్తి''.

'ప్రజాస్వామ్యం' అంటే ఏమిటి? 'శీలం' అంటే ఏమిటి? 'సాహసం' అంటే ఏమిటి?

ఇలా కనిపించిన ప్రతి వ్యక్తిని ప్రశ్నించటం సోక్రటీసు పద్ధతి. అన్నిటినీ సందేహించు, అన్నిటినీ ప్రశ్నించు. అప్పుడుగాని సత్యం బోధపడదు. ప్రశ్నలకు నీవే సమాధానం చెప్పుకో. నీ మనస్సులోనే ఆ సమాధానాన్ని దాచిపెట్టుకున్నా తప్పులేదు.

సోక్రటీసు ప్రశ్నపద్ధతిగా ఇది తత్వశాస్త్రంలో శాశ్వత స్థానం సంపాదించుకున్నది

ప్రతి అంశాన్ని ప్రశ్నించే స్వభావం ఏథెన్సు పౌరులకు సోక్రటీసు నేర్పాడు. యువకులలో హెచ్చుమంది సంశయాత్ములైనారు. వెనుకటివలె పాలకులు ఏం చెపితే అది చేయటం మానివేశారు.

పాలకులలోని అవినీతిని సోక్రటీసు బహిర్గతం చేసేవాడు. గ్రీకు దేవతలను అవహేళనం చేసేవాడు. సోక్రటీసు నాస్తికవాది కాదు. ఏదో పేరులేని పరతత్వం వుందనేవాడు.

ఏథెన్సులో పౌరులందరికీ పరిపాలనలో భాగస్వామ్యం వుండేది బానిసలకు మాత్రం లేదు. వారిని మానవులుగానే అసలు పరిగణించేవారు కాదు

పౌరుగున వున్న స్పార్టాలో నియంతలు పరిపాలించేవారు ఏథెన్సుకు, స్పార్టాకు జరిగిన యుద్ధంలో ఏథెన్సు ఓడిపోయింది పౌరు లందరినీ యుద్ధానికి విముఖులను చేసిన ద్రోహి అని సోక్రటీసుపై నాటి పాలకులు ఆరోపణ చేసి మరణశిక్ష విధించారు

మరణశిక్ష నుండి తప్పించుకోటానికి ఒక మార్గం వుంది ఏథెన్సు నుండి పారిపోవటం 71 ఏండ్ల వయస్సు కలిగిన సోక్రటీసు అందుకు అంగీకరించలేదు

''ఎలా జీవించానో అలాగే మరణిస్తాను. మరణాన్ని తప్పించుకోవటం తేలికే. నేర ప్రవృత్తి నుండి బైటపడటమే కష్టం నన్ను మృత్యువు ఆవహిస్తున్నది నాపై ఆరోపణ చేసిన వారు తమ నేరప్రవృత్తికి తామే శిక్ష అనుభవిస్తారు నా శరీరాన్ని మీరు ఖననం చేస్తారు నా ఆత్మను కాదు''

ఇట్టి అచంచల ధైర్యంతో మృత్యువును ఆహ్వానించిన మరో తత్వవేత్త ప్రపంచ చరిత్రలోనే లేడు

సోక్రటీసు మరణ దృశ్యాన్ని ప్లేటో తన డైలాగ్స్ (సంవాదాలు) గ్రంథంలో కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు తనకు రోజూ పాలు యిచ్చే ముసలమ్మకు బాకీ చెల్లింపుగా ఒక కోడిపెట్టను ఇవ్వాలనే ఆఖరు కోర్కెను వెలిబుచ్చి, ప్రశాంతంగా మరణించాడు.

తత్వవేత్త ప్రథమ కర్తవ్యం శ్రోతలకు, పాఠకులకు ప్రశ్నించే స్వభావం అలవర్చటం. ఆ బాధ్యతను జయప్రదంగా నిర్వహించినందుననే తాత్విక ప్రపంచంలో సోక్రటీసు శిఖరాయమానంగా నిలిచి వున్నాడు.

## ప్లేటో

సోక్రటీసు బోధలను విశ్వవ్యాప్తం చేయటమే తన జీవిత కర్తవ్యంగా భావించిన ప్లేటో ఏథెన్సు నగరంలో అకాడమీని స్థాపించాడు. ఆ విద్యాకేంద్రంలో సోక్రటీసు భావాలను, తన చేర్పులను, కలిపి బోధించేవాడు ప్లేటో రచన 'సంవాదా'లు చదివితే సోక్రటీసు ఎక్కడ ముగిశాడు, ప్లేటో ఎక్కడ మొదలైనాడు అని గీత గీయటమే కష్టం

ప్లేటో తన రచనల్లో చర్చించని అంశం అంటూ లేదు విశ్వమానవ సౌభ్రాతృత్వం, నరవంశ శాస్త్రం, సోషలిజం, కమ్యూనిజం, సంతాన నిరోధం, స్వేచ్ఛా ప్రేమ, వాక్స్వాతంత్ర్యం, నైతిక సూత్రాలు - ఇలా సర్వ విషయాలూ చర్చించాడు

'రిపబ్లిక్' గ్రంథంలో ఆదర్శ సమాజం ఎలా వుండాలని కోరుకున్నాడో ప్లేటో వివరించాడు.

స్త్రీ, పురుషుల శారీరక, మానసిక సమపరిపక్వతా స్థాయి ననుసరించి వివాహాలు ప్రభుత్వమే జరిపించాలి. ఉత్తమ సంతానాన్ని వారు సృష్టించిన మీదట, తల్లిదండ్రు లెవరో కూడా తెలియకుండా పిల్లలను ప్రభుత్వమే పెంచాలి. వారి శక్తిసామర్థ్యాల ననుసరించి పిల్లలను మేధావులు, సైనికులు అను రెండు శ్రేణులుగా విభజించాలి. మిగతా వారిని రైతులు, వ్యాపారస్తులు, శ్రామికులుగా పరిగణించాలి ఈ మూడు తరగతులు కాక, బానిసలు అధమశ్రేణివారు ఎలాగూ వుంటారు

ప్రథమశ్రేణివారు తాత్వికులు. ''తాత్వికులు రాజ్యాన్ని పరిపాలించాలి. లేక పాలకులు తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేయాలి'' అని ప్లేటో ఆదర్శం రెండో శ్రేణివారు దేశ సంరక్షకులు, అనగా సైనికులు. యీ విధంగా ఉత్తమ సంతానాన్ని ప్రభుత్వం విభజించిన తరువాత, తల్లిదండ్రులు కావాలనుకుంటే తిరిగి యథేచ్ఛగా లైంగిక సంబంధాలు ఏర్పరచుకోవచ్చు. తద్వారా కలిగే సంతానం మూడో శ్రేణిలో చేరుతారు.

పాలకులైన తాత్త్వికులకు స్వంత ఆస్తి వుండరాదు. వారందరూ ఉమ్మడి భోజనాగారాలలో ఆహారం తీసుకోవాలి సైనిక స్కంధావారాల వంటి బారక్స్‌లో నిద్రించాలి

కవులకు యీ రాజ్యంలో స్థానం లేదు పుక్కిటి పురాణాల ద్వారా కవులు పాఠకులను కలుషితం చెస్తారు వారిని దేశం నుండి బహిష్కరించాలి.

మతం హేతువాదానికి అనుగుణంగా వుండాలి. మూఢవిశ్వాసాలను ప్రోత్సహించరాదు.

వ్యాపారస్థులు అవినీతిపరులుగా వుండి తీరుతారు. వారిని ఎప్పుడూ ఒక కంట కనిపెట్టి వుండాలి. నేరస్తులను దయదలచాలి. సంస్కరించాలి. శిక్షించరాదు.

రోగులకు వైద్యం చేయాలి. ఇక వ్యాధి నయం కాదు అనుకుంటే వారికి ప్రశాంతంగా మరణించే వీలు కలిగించాలి (Mercy Killing).

ఆదర్శ రిపబ్లిక్‌లో వ్యాజ్యాలంటూ వుండవు. న్యాయవాదులు వుండరాదు

ప్రజలకు ఆరోగ్యం, విశ్రాంతి, మానసిక ఔన్నత్యాన్ని కలిగించేది ఆదర్శప్రభుత్వం. సౌందర్యారాధన అత్యుత్తమ జీవిత లక్ష్యం.

ఆదర్శాలు చెప్పి ప్లేటో ఊరుకోలేదు. సిరిక్యూస్ దీవికి వెళ్ళి, అచ్చటి పాలకుడు డియోనిసస్‌కు యీ బోధలు చేశాడు.. అతడు ఆగ్రహించి, ప్లేటోను బానిసగా అమ్మివేశాడు. అదృష్టవశాత్తు బానిసగా వున్న ప్లేటోను ఒక ఉదార స్వభావుడు కొనుక్కున్నాడు. ప్లేటోను తత్వవేత్తగా గుర్తించి, ఏథెన్సు నగరానికి తిరిగి పంపివేశాడు. అటుపిమ్మట ప్లేటో యిలాంటి ప్రత్యక్ష ప్రయోగాలు చేయలేదు. అకాడమీని స్థాపించి, దాదాపు నలభై సంవత్సరాలు, వందలాది విద్యార్థులకు తనకు తెలిసిన విద్య లన్నిటినీ బోధ చేశాడు. ఈ అకాడమీలో తర్ఫీదు పొందిన శిష్యుడే అరిస్టాటిల్. అరిస్టాటిల్‌ను తన అత్యుత్తమ శిష్యునిగా ప్లేటో గుర్తించాడు. ''ఇతడు ఉత్తమాశ్వం. ఇతనికి ఎలా కళ్ళాలు వేయాలో తెలియటం లేదు'' అనేవాడు.

ప్లేటోను మించినవాడు అరిస్టాటిల్. ప్లేటో సామాజిక శాస్త్రాలకే పరిమితమైనాడు అరిస్టాటిల్ జంతు జీవశాస్త్రాలన్నీ అధ్యయనం చేశాడు. గురు శిష్యు లిద్దరూ తరచు తీవ్రంగా వాదించుకునేవారు

81వ సంవత్సరంలో ప్లేటో మరణించాడు. ఒక శిష్యుని ఇంట్లో వివాహపు విందుకు హాజరై, వాద్యఘోష, పానశాల కులాసాలను భరించలేక పక్కగదిలోకి వెళ్ళాడు.

పడకపై మేనువాల్చి, ప్రశాంతంగా కన్నుమూశాడు

## అరిస్టాటిల్

అరిస్టాటిల్ అత్యున్నత ధనిక కుటుంబంలో జన్మించాడు అతని తండ్రి ప్రపంచ విజేత అలెగ్జాండర్ తాతకు ఆస్థాన వైద్యుడు.

ప్లేటో వద్ద సకల విద్యలు నేర్చిన అరిస్టాటిల్ ప్లేటో తదనంతరం గురుకులానికి అధిపతి అవుతా ననుకున్నాడు. ప్రాంతీయ విభేదాలు అడ్డువచ్చాయి. అరిస్టాటిల్ జన్మస్థలం ఏథెన్సు కాదు. మాసిడొనియాకు చెందిన స్టగీరా.

ప్లేటో వలెనే అరిస్టాటిల్ ఆదర్శవాది. రాజు ఆదర్శవంతుడుగా వుండాలని ఆకాంక్షించి, తనకు ఆశ్రయమిచ్చిన హెర్మియాస్‌కు నీతిబోధ చేయసాగాడు. ఇందుకు విసిగి, అరిస్టాటిల్‌ను తన ఆస్థాన పండితుని హోదా నుండి హెర్మియాస్ తొలగించాడు. ఈలోగా పర్షియాతో జరిగిన యుద్ధంలో హెర్మియాస్ మరణించాడు.

ఇంతలో మాసిడొనియా రాజు ఫిలిఫ్ తన కుమారుడైన అలెగ్జాండర్‌కు విద్యాబోధ చేయటానికై అరిస్టాటిల్‌ను ఆహ్వానించాడు.

ఫిలిఫ్, అతని కుమారుడు అలెగ్జాండర్ ఆస్థానంలో అరిస్టాటిల్ విద్యాబోధకుడుగా, ఆస్థాన వైద్యుడుగా దీర్ఘకాలం గడిపాడు. ఈలోగా తన విద్యా వైదుష్యాన్ని బహుముఖాలుగా విస్తరించుకున్నాడు.

'మెటఫిజిక్సు' (తత్వశాస్త్రం) అను గ్రంథంలో సృష్టికర్తను గురించి, 'పాలిటిక్స్' అనే గ్రంథంలో ప్రభుత్వాన్ని గురించి, 'ఎథిక్స్' అనే గ్రంథంలో నైతిక సూత్రాలను గురించి అరిస్టాటిల్ చర్చించాడు. ఇవి కాక, ఆధునిక తర్క విద్యకు అరిస్టాటిల్ ప్రథమ గురువు.

దేవుని అస్తిత్వాన్ని అరిస్టాటిల్ అంగీకరించాడు. దేవుడు సృష్టికర్త కాడు. సృష్టి చోదకుడు. తాను కదలడు, చలనం లేదు, ఏ భావావేశాలు దేవునికి లేవు. సృష్టి మాత్రం నిరంతర చలన శీలం. మానవులు దేవుని గురించి ఆలోచిస్తారు. దేవునికి యీ ప్రపంచమే పట్టదు. నిర్గుణ పరబ్రహ్మ.

అందమైన స్త్రీ వైపు ప్రపంచమంతా చూస్తుంది. ఆమె మాత్రం ప్రపంచంవైపు చూడదు. ఏకాగ్రతతో, నిరావేశంగా వుంటుంది. దేవుడు అలాంటివాడు అరిస్టాటిల్ దృష్టిలో.

భూలోక విషయాలను చర్చించే సందర్భంలో అరిస్టాటిల్ భావాలు మరింత స్పష్టంగా వుంటాయి. రాచరికం, నియంతృత్వం, ప్రభువర్గ పాలన, ప్రజాస్వామ్యం - వీటన్నిటిలోకి చట్టబద్ధమైన ప్రజాస్వామ్యం అంటేనే అరిస్టాటిల్‌కు ఇష్టం.

ప్లేటో ఆదర్శ రాజ్యభావనకు అరిస్టాటిల్ పూర్తి వ్యతిరేకి. అందరిదీ బాధ్యత అంటే ప్రతి వ్యక్తి పక్కవాడిదే బాధ్యత అనుకుంటాడు. అంతా సోమరిపోతులై, అరాచకం వస్తుంది. వ్యక్తి బాధ్యత పైననే సమాజం నడవాలి. స్వంత ఆస్తి వుండాలి.

ప్రభుత్వం నైతిక సూత్రాల ననుసరించి పరిపాలించాలి. ప్రభుత్వాలు వ్యక్తి క్షేమం కొరకు, వ్యక్తి ప్రభుత్వాల కొరకు కాదు.

ఆ నాటికి తెలిసిన సర్వ విద్యలలోను అరిస్టాటిల్ పండితుడు వైద్యం, జీవ సామాజిక శాస్త్రాలు, లలిత కళలు, అలంకార శాస్త్రం - ఒకటేమిటి అన్నిటినీ ఆయన బోధించేవాడు. ప్రాచీన గురు కులపద్ధతిలో నడుస్తూ పాఠాలు చెప్పేవాడు శిష్యులు వింటూ, నోట్సు రాసుకునేవారు.

చివరి రోజులలో అలెగ్జాండర్‌కు అరిస్టాటిల్‌కు విభేదాలు తలెత్తాయి అరిస్టాటిల్ ఆదర్శాలు అలెగ్జాండర్‌కు పట్టలేదు ప్రపంచ విజేతగానే మిగిలిపోవాలని అలెగ్జాండర్ ఆకాంక్ష అందుకు ఎట్టి పద్ధతులనైనా అవలంబించడానికి అతడు వెనుకాడలేదు. ఆ పరిస్థితిలో అరిస్టాటిల్ మాసిడోనియా నుండి ఏథెన్సు వెళ్ళి, దీర్ఘకాలం ఒక గురుకులంలో బోధ చేశాడు. అక్కడ కూడా పాలకులకు కంటకప్రాయుడైనాడు ''తత్వవేత్తను రెండోసారి హత్యచేసే కళంకం ఏథెన్సు పాలకులకు తప్పించేందుకు'' తాను సిసిలీకి పారిపోతున్నానని అన్నాడు. సోక్రటీసును హత్య చేసిన ఉదంతం మొదటిది.

అరిస్టాటిల్ ప్రవాసంలో మరణించాడని ఒక కథనం. ఆత్మహత్య చేసుకున్నాడని మరొక కథనం.

అరిస్టాటిల్ నిజజీవితంలో ఉదారవాది. తన బానిస లందరికీ విముక్తి కలిగిస్తూ మరణశాసనం రాశాడు.

# విశిష్ట వైజ్ఞానికుడు నాయుడమ్మ
## (ఒక జ్ఞాపకం)

**- డాక్టర్ సంజీవదేవ్**

గుంటూరు జిల్లాలోని 'నగరం' కాలేజీలోని ఉదయపు కార్యక్రమాలు ముగిసిన తరువాత ఇద్దరు వ్యక్తులం దూరంగా ఉన్న ఒక చెట్టు నీడలో విశ్రమించాం.

వారిలో ఒకరు జగద్విఖ్యాత వైజ్ఞానికుడు డా. యలవర్తి నాయుడమ్మ, రెండవ వ్యక్తి అంతగా ప్రసిద్ధుడు కాని డా. సంజీవ్‌దేవ్. నాయుడమ్మగారు ప్రజ్ఞ గల లెదర్ టెక్నాలజిస్టు.

''నాయుడమ్మగారూ! ఈ మధ్య మీరు ఈ దేశంలో ఎక్కువ రోజులుంటున్నట్టు లేరు.''

ఆయన నవ్వుతూ అన్నారు: ''ఈ దేశంలోనేకాదు, ఏ దేశంలో కూడా ఎక్కువ రోజులు వుండటం లేదు'' అని.

''కాలానికి దేశానికి నూతన అర్థాలను సృష్టించే మీలాంటి మహా వైజ్ఞానికులకు అన్ని దేశాలు స్వదేశాలే, అన్ని కాలాలు తాత్కాలికాలే. నేను 'సైన్సు' అనీ, 'విజ్ఞానం' అనీ కూడ వాడతాను ఇక్కడ.''

వాడండి. ''అవును, నేను వైజ్ఞానికుడనే. అయినా వైజ్ఞానికేతరులను నేను తక్కువ చూపు చూడను. నా రంగంలో నేను విశిష్టుడనే, సందేహం లేదు. మరి మీ వివిధ రంగాల్లో మీరూ అంతే'' అంటూ వచ్చే నవ్వును పూర్తిగా రానివ్వకుండా ఆపుకున్నారు.

''సరే, కాదనను. అయినా ఈ కంటికి కనిపించే, చెవికి వినిపించే, ముక్కుకు వాసన వచ్చే, నాలుకకు రుచి తగిలే, చర్మానికి స్పర్శ తగిలే-ఈ ఇంద్రియ గ్రాహ్య జగత్తు రహస్యాలను బహిర్గతం చేయటంలో వైజ్ఞానికుల కృషి

అందుకు ఆయన అన్నారు: ''నా బాల్యం నుంచీ ఇప్పటి వరకు వైజ్ఞానిక విషయాలతో విసుగు చెంది వున్నాను. మీలాంటివారు, సాంస్కృతి రంగానికి చెందినవారు, కనిపించినప్పుడు కూడ వైజ్ఞానిక విషయాలనే వల్లెవేయటం నాకు ఆనందంగా వుండదు. అందుకని మన ముచ్చట్లు సాహిత్యాన్ని గురించి, శ్రవ్య, దృశ్య కళలను గురించి, తాత్త్విక, తార్కిక విషయాలను గురించి సాగించుదాం.''

''సరేనండి, మీ ఇష్టం ఏదో అదే చేతాం.'' కొన్ని విశిష్ట విషయాల పేర్లను ఆయన తెలుగులో సక్రమంగా అనలేక ఇంగ్లీషులోనే అనేవారు. సామాన్య భాషవలె తేలికయింది కాదు పరిభాష, ''అయితే, మన సంభాషణల్లో వైజ్ఞానిక విషయాలను పూర్తిగా వదలివేయటం నాకు ఇష్టం వుండదు. మధ్య మధ్య వాటికి కూడ తావు ఇస్తూనే వుండాలి. మీరు వైజ్ఞానికులు కనుక వైజ్ఞానిక విషయాల మీద కంటే వైజ్ఞానికం కాని విషయాల మీద మీకు కుతూహలం వుండటం సహజం. అదే మాదిరి, నేను వైజ్ఞానికుడను కాదు కనుక నాకు వైజ్ఞానిక విషయాల మీద కుతూహలం వుండటం సహజం. మనం ఒక రాజీ మార్గాన నడుద్దాం. అంటే మన మాటల మధ్య వైజ్ఞానిక విషయాల్ని కూడ తొలగించవద్దు ''

''ఆ విధానం మీకు ఆనందంగా తడితే సరే అట్లాగే కానివ్వండి. వైజ్ఞానిక విషయా లేమిటి, వైజ్ఞానికేతర విషయాలేమిటి, అన్నీ కూడ మానవ విషయాలే కనుక వాటి విషయంలో మనకు నిషిద్ధం లేదు. మనకు ఎవరి స్వతంత్రాలోచన వారి కుంటుంది'' అన్నారు.

నాయుడమ్మగారిలో తెలుగు భాషాభిజ్ఞత కొంత లోపించి వుండటంతో గ్రహించటం, ఆలోచించటం మొదలైన పదాలు వాడాలసిన చోట Perception, Conception అనే ఇంగ్లీషు పదాలను వాడేవారు. అదేవిధంగా భౌతిక, అభౌతిక అనే పదాలు తెలుగులో పరిచయం లేనందున Physical, metaphysical అనే వాటిని వాడేవారు. ఒక సందర్భంలో నేను Cerebration, sensation అనే ఇంగ్లీషు పదాలను వాడితే ఆ పదాలను తెలుగులో ఏమంటారని

అడిగితే మేధా(క్రియ, సంవేదన అని అంటారన్నాను. అటువంటి వాటిని ఆయన తన నోటుబుక్‌లో సంతోషంగా ఎక్కించుకొన్నారు. అదేవిధంగా analysisకు విశ్లేషణ అనీ, synthesisకు సంశ్లేషణ అని కూడ.

ఎంతగానో ఉల్లాసంగా మాట్లాడుకొంటున్నాం. కాని ఆయనకు కాని, నాకు గాని తెలియదు- తాను జీవించేరోజుల్లో నుంచి కొన్ని రోజులు త్వరత్వరగా తగ్గుతున్నాయని. మేము కలుసుకున్న కొన్ని రోజులకే ఆయన ఈ భూమి మీద శాశ్వతంగా లేకపోవటం సంభవించింది అమెరికా నుంచి తిరిగి వస్తుండగా ఐర్లండు సముద్ర తీరంలో ఆయన పయనిస్తున్న విమానం ప్రేలిపోయి ఆయన శాశ్వతంగా కన్ను మూశారు. ఆ విమానం ప్రేలటం కాక ప్రేల్చబడినట్లు అటు తరువాత రుజువైంది. ప్రపంచంలోని వైజ్ఞానిక రంగానికి చెందిన ఒక మహామహుడు లేకుండా పోయినాడని ఖండఖండాంతరాలు కూడా విలపించాయి ఆ ఘోర సంఘటనకు

మేము ఆ చెట్టు క్రింద కూర్చొని ఒక గంట కావచ్చింది. క్రమేణ సూర్యుడు పైకొచ్చినకొద్దీ చెట్టు నీడ మొదటున్నంత పొడవు కంటే కొంచెం తగ్గినట్లు కన్పించింది. చాలా సేపటి నుంచి మేము ఇద్దరం మాత్రమే వున్నాము ఆ చెట్టు క్రింద. కొంత సేపటికి మాకు తోడుగా రెండు తెల్ల కొంగలు వచ్చి చెట్టుకొమ్మ మీద కూర్చొని మా భాషలో మేము మాట్లాడు కొంటున్నట్లే వాటి భాషలో అవి మాట్లాడుకో సాగాయి.

మా మాటలు అవి వింటున్నాయో లేదో తెలియదు కాని, వాటి మాటలు మాత్రం మేము వింటున్నాం అని మాకు తెలుసు. నాయుడమ్మ గారు ఆ కొంగల వైపు చూడ సాగారు శ్రద్ధగా. వాటి మాటలు మీకేమైనా తెలుస్తున్నాయా? అన్నాను. ''లేదు నాకు మనుషుల భాష మాత్రమే తెలుసు కాని పశువుల భాష, పక్షుల భాష తెలియదు. మీరు కొండల్లో కోనల్లో అరణ్యాల్లో చాలా చాలా తిరిగారు. మీ హిమాలయ పర్యటన కాలంలో. అందువల్ల పక్షుల భాషతో మీకు కొంత పరిచయం అయి వుండాలి. కొమ్మ మీద కూచున్న కొంగలు ఏమి సంభాషించుకొంటూన్నాయో మీకే తెలియాలి'' అన్నారు.

అయితే, అవి ఏమనుకుంటున్నాయో చెపుతా వినండి నేను మీకు వాటి పక్షి భాషలో చెప్పక వాటి పక్షి భాషను తెలుగులోకి అనువదించి చెపుతా వినండి ''మనం రెక్కలు నొప్పిపుట్టేట్లుగా ఎగిరివచ్చి ఈ చెట్టు మీద కూచున్నాం వృథాగా. ఆ సరోవరంలో మనం ఆశించినంతగా చేపలు దొరక లేదు. సరస్సుల్లో దొరకని చేపలు మనకు చెట్టు మీద దొరుకుతాయా? మనకంటే తెలివి తక్కువ వాళ్లు ఎవరూ వున్నట్లు లేరు. పద, మరో సరస్సు దగ్గరకు ఎగిరిపోదాం. మనకు రెక్కలుండటం ఎగరటానికే కాని కూచోటానికి కాదు, పద పోదాం'' అని అంటున్నాయి అవి.

నాయుడమ్మ గారికి నవ్వు ఆగలేదు ''పక్షిభాషను తెలుగులో నాకు వినిపించినందుకు ఎంతో సంతోషం. రాబోయే నా విదేశీ ప్రయాణాల్లో అక్కడి మిత్రు లందరికీ చెపుతాను. భారతదేశంలో మా మిత్రు డొకరికి కొంగల భాష తెలుసునని.''

మా సంభాషణల మధ్య మాకు తెలియకుండానే లంచ్ వేళ అయింది. మా కోసం మనిషి వచ్చాడు. మేము లేచాం చెట్టు క్రిందనుంచి. కాని చెట్టుమీదనుంచి ఆ కొంగలు లేవ లేదు, వాటిని పిలవటానికి ఎవరూ రానందునేమో!

నాయుడమ్మగారు ఎంత గంభీరమైన వైజ్ఞానికుడో అంత హాస్యప్రియుడు కూడ. చౌకపారు కానట్టి చమత్కార సంభాషణలు ఆయనకెంతో ఇష్టం. అటువంటి చమత్కారాలను ఆయన స్వయంగా పలకటంలోను, ఇతర్లు పలుకుతుంటే వినటంలోను కూడ ఆయనకు ఎంతో ఆనందం. కొద్దిమందితో కూడిన ఆ లంచ్ అటువంటి చమత్కారాలతోనే ప్రారంభమైంది, వాటితోనే ముగిసింది. ఒక సందర్భంలో నేనన్నాను, ''శాకాహారం తినేవాళ్లు మాంసం తినరు, కాని మాంసాహారం తినేవాళ్లు శాకాహారం కూడా తింటారు. అది చాలా అన్యాయమైన పని.'' నాయుడమ్మగారు ఆ సత్యాన్ని సుహృదయతతో స్వీకరించారు.

ఇక మాకు సాయంత్రం కార్యక్రమం వరకూ పనిలేదు. అప్పటి వరకూ మనం ఆగ్రంథాలయంలో గడుపుదాం. మళ్లీ ఎప్పటికి కలుస్తామో అనుకున్నాం. కాని విచారం ఏమంటే మళ్లీ మేము కలుసుకోనేలేదు. నేను ఈ భూలోకంలోనే వుండిపోయాను, ఆయన ఈ భూలోకాన్ని శాశ్వతంగా వదలి వెళ్లటం జరిగింది జ్ఞాపకాల్లోను, స్వప్నాల్లోను తప్ప తిరిగి నాయుడమ్మ గారిని చూచే అవకాశం పూర్తిగా నశించిపోయింది. ఒక వ్యక్తి మొదటినుంచీ

కనిపించకపోవటంలో విచారం వుండదు, కనిపించనివ్యక్తి కనిపించినపుడు ఆనందం వుంటుంది. ఆ వ్యక్తి చివరకు కనిపించకుండా పోయేవరకు ఎక్కువ విచారం జనిస్తుంది

మే ముభయులం గ్రంథాలయంలో ఆ గ్రంథాలను, ఈ గ్రంథాలను అటూ ఇటూ తిరగవేసి కొంత సేపు, తరువాత ఒక కిటికీ దగ్గర బయటికి చూస్తూ కూచున్నాం మౌనంగా. మౌనం కొంత సేపటి వరకే బాగుంటుంది కాని తరువాత మాటల్లోకి మారటమే బాగుంటుంది.

''చూడండి మహాశయా, నేడు అద్భుతంగా వికసించిన వైజ్ఞానిక పరిణామాలకూ, పతనమై పోతున్న మానవ జీవన విధానానికీ మధ్య వున్న అతి వెడల్పయిన, లోతయినగండిని పూడ్చటానికి ఏమిటి ఉపాయం? విజ్ఞానంలోని ప్రతి విభాగం కూడ ఎక్కాలసినంత ఎత్తుకు ఎక్కింది, మానవ సమాజం దిగాలసినంత అడుగుకు దిగిపోయింది ''

''అవును, ఈ సమస్య ఎంతప్రయత్నించినా సమస్యగానే మిగిలి పోతుంది కాని పరిష్కరించబడటం లేదు విజ్ఞానం కోసమే విజ్ఞానం కాని సమాజానికి శ్రేయం కలిగించటానికి కాదు అని ఎంత మహా వైజ్ఞానికుడు కూడ అనటానికి సాహసించడు. అయినా, జీవితానికి చెందిన ఏ రంగంలోని మహానుభావుడూ కూడా ఈ విషయంలో ఏమీ నెరవేర్చలేక పోతున్నాడు. వైజ్ఞాని కుడు మానవుడే, సమాజం మానవ సమాజమే. కాని రెండూ ఎవరి త్రోవన వారుండి పోతున్నారు. ఈ రెంటికీ ఐక్యత సమకూరాలి; మనమంతా కలసి సమకూర్చాలి.''

నేనన్నాను, ''నేను వైజ్ఞానికుడనూ కాదు సమాజ సంస్కారినీ కాదు. అయినా ఒక ఆలోచన అపుడపుడు నాలో అస్పష్టంగా తలఎత్తుతుంటుంది. అదేమంటే వైజ్ఞానిక విద్యా బోధన ఎక్కువ భాగం మానవుడికి బయట వుండే విజ్ఞానాల మీదనే కేంద్రీకృతమై వుంటూ మానవుని లోపలి భాగానికి సంబంధించిన మానసిక విజ్ఞానాన్ని నిర్లక్ష్యం చేస్తున్నా రనేది.''

''అవును, ఈ సత్యం నాకు కూడ అపుడపుడు తడుతూనే వుంటుంది. మనిషికి తన చుట్టూ వున్న వాటిని గురించి తెలిస్తేనే చాలదు. తన చుట్టూ వున్న వాటిని గురించి తెలుసుకొనేది తన లోపల వున్న మనసు తన చుట్టూ వున్న దాన్ని, అంటే తనకు బయట వున్న జగత్తును, మనం భౌతిక జగత్తు అంటాం ఖగోళ విజ్ఞానం, భూగోళ విజ్ఞానం, భూగర్భ విజ్ఞానం, వృక్ష, జంతు విజ్ఞానాలు మొదలైనవన్నీ మనిషికి బయటి విజ్ఞానాలే అవి తెలిసినంత మాత్రాన మనిషికి సర్వం తెలిసినట్లుకాదు'' అని ఇంకా ఏదో చెప్ప ప్రయత్నిస్తున్నారు

''ఆగండి! మీరు తెలిపిన విషయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఒక వైజ్ఞానికుని మాటలతో వైజ్ఞానికేతరుడు కూడ ఏకీభవించక తప్పదు కాని ఒక వైజ్ఞానికేతరుని మాటలతో వైజ్ఞానికుడు ఏకీభవించటం కుదరదు మనిషికి తన బయటి వస్తువులు, లేక విషయాలు ఎంతవసరమో వాటిని తెలుసుకోటం మనిషికి అంతకంటే ఎక్కువవసరం రాయి మనకు తాను రాయి అని తెలుపలేదు, మనసు మాత్రమే తెలుపుతుంది అది రాయి అని. తెలిపే మనసు లేనపుడు తెలపబడే రాయి లేనట్లే అయితే ఇక్కడ మరో చిక్కుకూడ వుంటుంది రాయిని తెలిపే మనసు వుండి రాయి లేనపుడు ఆ రాయి వున్నట్లు మనసు మాత్రం ఎట్లా తెలుపుతుంది? మనకు బయట ఒక వస్తువున్నట్లు తెలపటానికి ఆ వస్తువూ వుండాలి, మనసూ వుండాలి అందుకే అనేది, జీవితానికి భౌతిక విజ్ఞానం అవసరం, అదే మాదిరి మనో విజ్ఞానం అవసరం. అంతే అంటారా? ''

''మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలు మిధ్యలు కానంతవరకు, నేనేమిటి, మరితరులు ఎవరైనా కూడ వాటితో ఏకీభవించక వుండలేరు ఒక సత్యం తనకిష్టమైతే మాత్రమే దాన్ని అంగీకరించటం, అయిష్టమైతే అంగీకరించకపోవటం వైజ్ఞానిక దృష్టి కాదు'' అన్నారాయన గంభీర స్వరంతో

''అందుకే అంటాను, మన విద్యా సంస్థల్లో ఆ రెంటిలో ఒక దానికిచ్చిన ప్రాధాన్యం మరొక దానికివ్వటం లేదని. ఒక విద్యార్థికి ఆక్సిజన్ అంటే ఏమిటో, హైడ్రోజన్ అంటే ఏమిటో తెలిసినంతగా ఆలోచన అంటే ఏమిటో అనుభూతి అంటే ఏమిటో తెలియదు మొదటివి రెండూ వస్తు జగత్తుకు సంబంధించినాయి, తరువాతవి రెండూ మానస జగత్తుకు సంబంధించినాయి. ఈ రెండు విధాల విద్యలూ కూడ మనిషిలో చోటు చేసుకుంటే జీవితానికి విజ్ఞానం దూరమైపోదు, విజ్ఞానానికి జీవితం దూరమైపోదు నేను వైజ్ఞానికుడిని కాదని మీకూ తెలుసు, మీకంటే ఎక్కువ నాకూ తెలుసు. అయినా, నాకు కొన్ని కొన్ని వైజ్ఞానిక విషయాలు తెలుసుననే భ్రాంతికి లోనవుతుంటాను

అందువల్ల నేను మిమ్ము కోరేది ఏమంటే మధ్య మధ్య నేను మిధ్యావైజ్ఞానికుడు (Pseudo-scientist) గా నటించే అనుమతి నాకివ్వమని.''

''భలేవారండీ మీరు, అట్లాగే అందుకు అనుమతి ఇస్తున్నాను, మీకు ఇష్టం వచ్చినట్లు నటించండి అయితే నాకు కూడ మీరు ఒక అనుమతిని ఇవ్వాలి, మీ నటనను నేను మొత్తం నటన అని నమ్మకుండా వుండేట్లు.''

''సరే, ఇక అదంతా మీ ఇష్టం. కొందరు ఏదో ఒక విషయాన్ని చెప్పి అది పూర్తిగా వైజ్ఞానిక సత్యం కనుక దాన్ని కాదనవద్దు అని అంటారు. అందుకు నేనంటాను, వైజ్ఞానిక సత్యాలనుకునే వాటన్నిటినీ నమ్మమనటం మూఢ నమ్మకాలు అవుతాయి. వైజ్ఞానికులు ఫలానిది మాత్రమే సత్యం అని నొక్కి చెప్పిన విషయాలు కొంతకాలానికి ఆ సత్యం అసత్యం అని రుజువైన తార్కాణాలున్నాయి. ఒకప్పుడు వైజ్ఞానికులు కనుగొన్న విషయం నిత్య సత్యంగా చెల్లుబడి అయింది. కాని కొన్ని నిత్య సత్యాలు అనబడేవి అనిత్య సత్యాలని తరువాత తరువాత రుజువైంది.''

''అవును, అటువంటి తార్కాణాలు వైజ్ఞానిక రంగాలన్నిటిలో కాకపోయినా కొన్నిటిలో అయినా కనిపిస్తాయి. ఎంతో దూరం పోనవసరం లేదు. చార్లెస్ డార్విన్ వ్యాప్తిలోకి తెచ్చిన పరిణామ సిద్ధాంతాన్ని కూడ కొందరు ఆధునిక వైజ్ఞానికులు అది తప్పు అని రుజువు చేశారు. పదార్థం మూడు ఆయతనాలను మాత్రమే కలిగి వుంటుందని చాలా కాలంగా నమ్మబడుతూ వచ్చిన సిద్ధాంతాన్ని ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్ తప్పు అని, పదార్థం నాలుగు ఆయతనాలను కలిగి వుంటుందని నిరూపించాడు. అందుకే అనేది, వైజ్ఞానిక సత్యం కాని, మరో సత్యం కాని మారని శాశ్వత సత్యం కాదని.''

''ఈ విషయంలో మనమధ్య ఏ భేదాభిప్రాయాలు లేనందుకు సంతోషమండి ఇంతటితో ఈ వైజ్ఞానిక చర్చను ఆపి మిగతా సాంస్కృతిక విషయాలను స్పృశింప ప్రయత్నిద్దాం. ముందుగా మనం విజ్ఞానం (Science) అనేదానికి, కళ అనేదానికీ నిర్వచనాలు చెప్పుకొందాం వీటికి సరళమైన నిర్వచనాలు ఏమంటే సైన్సు (విజ్ఞానం) అంటే 'తెలుసుకోటం' అనీ, కళ అంటే 'చేయటం' అనీ అందుకని ప్రతి 'తెలుసుకోటం' సైన్సు కాదు, ప్రతి 'చేయటం' కళ కాదు. సమీక్షాత్మకంగా తెలుసుకోటం మాత్రమే సైన్సు; సృజనాత్మకంగా చేయటం మాత్రమే కళ. ఆయన వస్తున్నాడు అని తెలుసుకోటం సైన్సు కాదు, అది భోగట్టా మాత్రమే అవుతుంది. పసుపూ సున్నం కలిస్తే ఎరుపు ఎందుకవుతుందీ అని తెలుసుకోవటం సైన్సు. ఇదే విధంగా, శిలను ముక్కలు ముక్కలుగా పగలగొట్టడటం కళ కాదు; అది కేవలం 'చేయటం' మాత్రమే అవుతుంది; శిలను సృజనాత్మకంగా చెక్కటం కళ.''

''సరళశైలిలో మీరు వ్యక్తం చేసిన వివరణ నాకు బాగా బోధపడింది. సృజనాత్మకమైన కళలను గురించి సమీక్షాత్మకమైన భాషలో విశద పరచటం సులభం కాదు. మీరు చేతితో కళా ఖండాలను చేస్తారు, నోటితో వాటిని వివరిస్తారు. మంచి సమయం ఇది. సరే, ఇక కొద్ది నిమిషాల్లో మనం సభా వేదిక దగ్గరకు పోతాం. ఈ లోపల మన దేశంలోని సాంస్కృతిక అంటే ఆధునిక సాంస్కృతిక వికాసాన్ని గురించి రెండు మాటలు తెలపండి.''

''అదేమిటండీ, అంత అమాయకంగా మాట్లాడుతారు? మీరు చెప్పటం, నేను వినటం జరగాలి కాని, అటుదిటూ, ఇటుదటూ జరగటానికి వీలు లేదు. సాంస్కృతిక విషయాలను గురించి మీకు తెలియదని నమ్మే అజ్ఞానిని కాని, అమాయకుడిని కాని కాను నేను. ఒకరి వైజ్ఞానిక జీవితం ఇతర సాంస్కృతిక విజ్ఞతలకు దూరంగా వుండాలని నియమం ఏమీ లేదు. ఒక విధంగా చూస్తే సైన్సు కూడ సాంస్కృతిక జగత్తుకు బయటిది కాదు. సంస్కృతి అంతా సైన్సు కాదు కాని సైన్సు అంతా మాత్రం సంస్కృతియే.''

''సరే, సంతోషం. నేడు మనం మన కాలాన్ని ఎంతో ఎంతో కాంతి మంతంగా గడిపాము. మళ్లీ కలుద్దాం.''

''మీరు అడిగిన ఒక సాంస్కృతిక విషయాన్ని నేను ఇక్కడ వివరించ లేదు కాని సభా వేదిక మీద జరగబోయే నా ప్రసంగంలో ఆ విషయాన్ని వివరిస్తాను వినండి, చెవులతో వినటం కాదు, మనసుతో వినండి. ఆ నా ప్రసంగం ప్రత్యేకించి మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని చేసేదే రండి పోదాం.''

# కార్య కారణత : జ్ఞానం - సత్యం

- రావిపూడి వెంకటాద్రి
(హేతువాది సంపాదకుడు)

మానవుడి జ్ఞానమంతా వస్తువుల మధ్య సంబంధాలను గురించినదే. వస్తువులకూ తనకూ మధ్య సంబంధాలను గురించినదే. అంతకు వినా జ్ఞానం లేదు. ఆ జ్ఞానమంతా మనిషికి లభిస్తున్నదే. మనిషి అర్జిస్తున్నదే. అది అతని అవయవాల గ్రహణశక్తి మీద, గ్రహణరీతిమీద, ప్రకృతి అతనికి అందిస్తున్న వాస్తవికత మీద అధారపడినదే. అందువల్ల జ్ఞానమంతా మానవికమే. ప్రకృతిలో క్రమ బద్ధత (Order) లేకుంటే ఆ జ్ఞానం మనిషికి సాధ్యంకాదు. కాబట్టి జ్ఞానమంతా ప్రకృతిలోని క్రమపద్ధతకు సంబంధించినదే. అందువల్లనే జ్ఞానం క్రమబద్ధమైన దవుతున్నది. అంటే హేతుబద్ధమైన దవుతున్నది.

ప్రకృతి అంతా మనకు సంఘటనల అవిరతం (Continuum of events) గా గోచరమవుతున్నది. సంఘటనల మధ్య అవధిగా (ఎడంగా) ప్రదేశమూ (Space), వ్యవధిగా కాలమూ (Time) ఉనికిలోకి వస్తున్నాయి. సంఘటనల పరోక్షంలో ప్రదేశకాలాలకు అర్థంలేదు; చతుర్మితులకు (Four dimensions) అర్థంలేదు. సంఘటనల వల్లనే వాటన్నిటికీ అస్తిత్వం కల్గుతున్నది. ఈ సంఘటనలన్నీ కార్యాలేనని గమనించాలి. జగత్తంతా సంఘటనల అవిరత మంటున్నా మంటే, అది కార్యాల అవిరతమని గ్రహించాలి.

సంఘటనలన్నీ ఒకక్రమంలో జరుగుతున్నట్లు మనం గుర్తిస్తున్నాం. ఆ క్రమం ముందుకూ కావచ్చు, వెనుకకూ కావచ్చు. హైడ్రోజను, హీలియం రెండు విభిన్నమైన మూల ద్రవ్యాలైనప్పటికీ, అవి సూర్య మండలంలోనూ, మండే నక్షత్రాలన్నిటిలోనూ నిత్యమూ విచ్ఛిన్న మవుతున్నాయి. అవి అన్నీ కార్యాలే.

హైడ్రోజన్ హీలియంగా, హీలియం హైడ్రోజన్‌గా నిత్యమూ పరివర్తన చెందుతున్నాయి. అవి కూడా కార్యాలే.

ఆ పరివర్తనకు దోహదం చేసే ఇతర సంఘటనలు చాలావున్నాయి. అవన్నీ కార్యాలే

మనం గుర్తించినా గుర్తించకపోయినా, గ్రహించినా - గ్రహించకపోయినా, మనం వున్నా - లేకున్నా సంఘటనలు నిరంతరాయంగా, అనంతంగా జరుగుతూనే వుంటాయి.

అయితే మనం గుర్తించే దేమంటే, ఆ సంఘటన లన్నీ వాస్తవికా లనీ, అవి ఒక క్రమంలో జరుగుతున్నాయనీ.

మనం గ్రహించే దేమంటే, ఒక సంఘటన తర్వాత మరో సంఘటన జరుగుతున్నదనీ, అవి పరివర్తన రూపంలో వున్నవని. మనం నిర్ణయం చేసుకొనేదేమంటే, మొదటి సంఘటనను తెలుసుకొంటే రెండవ సంఘటననూ - రెండవ సంఘటనను తెలుసుకొంటే మొదటి సంఘటననూ సాధించవచ్చుననీ.

మనం అన్వయం చేసుకొనేదేమంటే దేని నుంచి సాధిస్తామో దాన్ని కారణమనీ - దేన్ని సాధిస్తామో దాన్ని కార్యమనీ. ఇదీ కార్య కారణ భావన మూలరూపం.

అంటే రెండు వస్తుదశల మధ్య వుండే సంబంధాన్నే మనం కార్యకారణత (Causality) అంటాం. ఈ కార్యకారణతను వివరించడమే ఆధునిక విజ్ఞానం (సైన్సు) చేస్తున్న కృషి.

## కార్యం నుంచి కారణం :

సంఘటనలు అవిరతమూ, అనంతమూ కాబట్టి, కార్యకారణాల గొలుసు కూడా అవిరతమే, అనంతమే. అయితే, మనం దీన్ని ఎక్కడి కక్కడే విభజించి ఎక్కడికక్కడే కార్యకారణాలుగా అవగాహన చేసుకొంటున్నాం అంటే, మనం వాస్తవికతని గ్రహించడం మీద కార్యకారణ విభజన ఆధార పడివుంది. అందువల్ల ఆ విభజన మానవికం అవుతుంది అయినా అది వాస్తవికమే కాని, ఆత్మాశ్రయం (Subjective) కాదు. అది విశ్వ జనీన అనుభవం (Universal experience) కాన, ఆత్మాశ్రయం కావడానికి వీలులేదు. ఏ ఒక్కరి భ్రమమాత్రమో అయినప్పుడే అది ఆత్మాశ్రయ మవుతుంది) ఈ కార్యకారణ భావనని విశ్వందాకా పొడిగిస్తే, విశ్వానికి వెలుపలి కారణం లేదనీ, వెలుపల-ముందు-వెనుక-పైన-క్రింద వగైరా అనే వేమీ లేవనీ, వున్నవనే వ్యర్థ వ్యూహాలకు లోను కానవసరం లేదనీ తేలుతుంది

అంతే కాదు, మన అనుభవంలో వున్న విశ్వమే వాస్తవమైనదనీ, దానికి ఊహించబడిన కారణం అపోహ జనితమనీ కూడా తేలుతుంది. వెలుపలి కారణాన్ని వూహించినవారే కార్యకారణ వాదానికి గుంట చిక్కులు కల్పించారు తప్ప, ప్రతి సామాన్య మానవుడు సైతం సంఘటనల క్రమంలోనే కారణ కార్యాలను చూడ గల్గుతున్నాడు. ఇది ఎలా సాధ్యమవుతున్నది? ఇంగిత జానం వల్ల.

## కారణ అవగాహన మానవికం:

నిజానికి సంఘటనలన్నీ కార్యాలే. కార్యాలు కాని సంఘటనలు లేవు. ఈ సామాన్య విషయాన్ని కొందరు తార్కికులు గ్రహించలేక పోవచ్చు కాని, సామాన్య మానవుడు గ్రహించగలడు సంఘటనలు (కార్యాలు) పదార్థాలు కావు. అవి వివిధ స్థాయిలలో వున్న పదార్థ ( (ద్రవ్య) ప్రవృత్తులు (Functions). మనిషి లేకున్నా. గుర్తించకున్నా, కార్యాలు జరుగుతూనే వుంటాయి అప్పుడు కారణాలుండవు. కారణాలుండవంటే వుండనే వుండవు. జరిగేవన్నీ కార్యాలే ప్రేక్షకులు లేని నాటకంలాగా ''జగన్నాటకం'' సాగిపోతూనే వుంటుంది.

అలా సాగిపోయే జగన్నాటకంలో ఒక అపూర్వ సంఘటన జరిగింది. ఆ జగత్పరిణామంలో భాగంగానే ఒకానొక దశలో ప్రేక్షకుడి పాత్ర, గ్రాహకుడి పాత్ర, ప్రతిస్పందకుడి పాత్ర నిర్వహించగల మనిషి అవతరించాడు సంఘటనల క్రమాన్ని చూచాడు, గ్రహించాడు, ప్రతిస్పందించాడు. క్రమపద్ధతిలో వున్న రెండు సంఘటనల (కార్యాల) మధ్య సంబంధాన్ని కారణకార్యాలు (Cause and Effect) గా విభజించుకొని జగన్నాటకాన్ని అర్థం చేసుకొంటున్నాడు. అర్థం చేసుకొన్న దాన్ని బట్టి తన అచరణకు మలుపు యిచ్చుకొంటున్నాడు. ఇలా యిచ్చు కోవడంలోనే అతని స్వఇచ్ఛ (స్వేచ్ఛ) ఇమిడివుంది ఏ సంఘటనను ఎంతవరకు కోరుకోవాలనేదే అతని స్వేచ్ఛ. గొంతెమ్మ కోరికలు కోరక పోవడంలో కూడా అతని స్వేచ్ఛ ప్రతిబింబిస్తుంది.

ప్రకృతిలోని క్రమాన్ని వివేచించగల దశ మానవుడిలో తొంగిచూచిన నాటినుంచి ఈనాటి వరకు ఈ ప్రక్రియ సాగుతూనే వుంది. మానవుడు మానవుడుగా, వివేకవంతుడుగా మనగల్గినంత కాలం ఈ కార్యకారణ భావన కొనసాగుతూనే వుంటుంది. ఏ హఠాత్ పరిణామం వల్లనైనా ఒకవేళ మానవజాతి అంతరిస్తే, కార్యాలు ఆగవు. అంటే, కార్యాలను కారణకార్య విభజన చేసేవారు వుండరని తాత్పర్యం కార్యాలు నిరంతరాయంగా జరిగిపోతూనే వుంటాయి. అందువల్ల రెండు కార్యాల (సంఘటనల) మధ్య సంబంధంగా గుర్తించబడే కార్యకారణ భావన సైతం మానవిక మవుతుంది. ఇలా గ్రహించడం సైతం మానవికమే. అంటే జ్ఞానం సైతం మానవికమేనని భావం.

కార్యకారణ స్పృహగా గుర్తించదగిన అంశం మానవేతర జీవుల్లో సైతం గుప్తంగా వున్నదని లోగడ చూచాం. అమీబా వంటి అత్యంత సూక్ష్మ జీవిసైతం శుష్క హస్తాలను (Pseudo-podeae) చాచి తన ఆహారాన్ని కబళించడంలో అ స్పృహ వ్యక్తమవుతుంది.

## అర్థం కోల్పోయిన సంస్కృత శబ్దాలు:

ఇక్కడ కార్యకారణ శబ్దాలను గురించి ఒకమాట. మనకు తెలుగు మాటలుగా సంక్రమించిన సంస్కృత భాషాపదాలు యేర్పడిన నాటిజ్ఞానం స్థాయి వేరు. అందువల్ల ఈనాడు ఆ పదాలకు మౌలిక అర్థాలు చెప్పు కోవడంలో కొంతచిక్కు తలెత్తుతుంది. అలాంటి వాటిలో ''ప్రపంచం, సృష్టి, కార్యకారణాలు'' మొదలైన పదాలు కూడావున్నాయి. భావాలు మారినా వాటిని ప్రకటించే భాష మారని దౌర్భాగ్యస్థితి మనది. కార్యం అంటే, ''చేయబడినది'' అనే అర్థం అమలులో వుంది. అంటే, కార్యాన్ని చేయించేవాడనే అర్థం వస్తుంది హేతువాదులు, భౌతిక వాస్తవికవాదులు, మానవ వాదులు, కార్యకారణ పదాలను ఆ అర్థాల్లో వాడడం లేదు వీరి కార్యకారణాలు రెండూ సంఘటనలే. సంఘటనలన్నీ పదార్థ (ద్రవ్య) ప్రవృత్తులే. జరిగేది ఏదైనా సంఘటనే ఆ సంఘటనల క్రమంలో మనం కారణ కార్యాలను చూస్తాం. కార్యకారణ సమస్యపై మనం అవగాహన చేసుకొన్న యీ పద్ధతి ''ఆదికారణ'' స్రష్టలైన అన్ని తరగతుల వారికీ కొరుకుడు పడదు.

ఒకప్పటి జిజ్ఞాసువులు ఈ ''ప్రపంచం'' అణువుల నుంచి తయారైందా, లేక అనంతర ద్రవ్యం నుంచి తయారైందా అని చర్చించారు. నిజానికి భావవాదు లెవ్వరూ దాన్ని ఆమోదించలేరు ఈ దేశంలో కపిలాదివైశేషికులూ, గ్రీసులో డెమోక్రిటిస్, ఎపిక్యూరస్, లూక్రెటియస్, లూసిపస్ మొదలైన ఎపిక్యూరియనులూ భౌతికవాద పరంగానే ప్రపంచ నిర్మాణాన్ని గురించి ఆలోచించారు అనాటి వారి ప్రపంచం,చాలా చిన్నది. వారి ప్రపంచ జ్ఞానమూ చాలా స్వల్పం అందులో నాటి భారతీయులకూ, గ్రీకులకూ మధ్య ఒక ప్రధానమైన తేడా వుంది. మన వారి సంస్కృత భాషా శ్లోకాలకు ఎవరికి కావలసిన అర్థంవారు చెప్పుకోవచ్చు ఎలా పడితే అలా అర్థం చెప్పుకోవడానికి గ్రీకు భాషలోని పదాలూ, పాఠాలూ లొంగవు.

ఈనాటి శాస్త్ర విజ్ఞానం అణువుల వద్దా, అనంతర ద్రవ్యం వద్దా జపం చేయడం లేదు. అవి ఒకప్పటి పదార్థ వాదానికి సంబంధించినవే అయినప్పటికీ, ఈనాడు వాటి అధ్యయనం కేవలం చారిత్రక ఆసక్తితో మాత్రమే చేయవలసి వుంటుంది తప్ప, అక్కడనే తిష్ట వేసుకొని కూర్చుంటే మనకు సత్యం దొరకదు. అంతే కాదు, ఆ ప్రయత్నం సత్యాన్వేషణను దారి తప్పిస్తుంది కూడా. అందులో ఆధునిక విజ్ఞానాన్నీ, దార్శనిక మార్గాన్నీ వెదకడానికి కొందరు ఘనులు చేస్తున్న కృషి ఫలించదు. కాబట్టి, వాటిని పాత శ్లోకాల్లో దోపడానికి సైతం వారు పెడమార్గం త్రొక్కేది కద్దు. ఇది అనుభవంలో మనం చూస్తున్న వాస్తవం ఐనా, ఎంత దోపినా, ఆధునిక విజ్ఞానం పాత శ్లోకాల్లో యిమడదు.

ఆధునిక పదార్థ విజ్ఞానం చాలా చాలా అభివృద్ధి చెందింది. భౌతిక వాదం కూడా దానికి అనుగుణంగా వికసించింది. ప్రాచీనుల అణువుల ప్రతిపాదన కేవలం వూహలకు సంబంధించింది దాన్ని ఎవ్వరూ, ఎప్పుడూ పుటంపెట్టి పరీక్షించ లేదు. వారి వూహలలోని అణువుకూ, ఈనాటి భౌతిక విజ్ఞానులు పరిశోధించి కనుగొన్న పరమాణువుకూ పోలికే లేదు.

## ఆధునిక పరమాణు విజ్ఞానం:

ఆధునిక పరమాణు విజ్ఞానం 1810లో డాల్టన్‌తో ప్రారంభమై ప్రయోగశాలలో ప్రవేశించింది. జె.జె. థాంసన్, రూథర్ ఫర్డ్‌ల కృషితో 19వ శతాబ్ది అంతానికి ఒక కొలిక్కి వచ్చింది. ఈ 20వ శతాబ్దిలో ఉరుకులు - పరుగులు తీస్తూ క్రమంగా వికసిస్తూ వస్తున్నది. పరమాణువు లోపలి

శకలాల (Particles) సంఖ్య ఒక్కొక్క మూల ద్రవ్యానికి (Element) ఒక్కొక రకంగా వుంటుంది. ఆ సంఖ్యను బట్టి మూల ద్రవ్యాల లక్షణాలుంటాయి కాబట్టి, నేటి శాస్త్రజ్ఞులు ఆ సంఖ్యను మార్చి ఒక మూల ద్రవ్యాన్ని మరో మూల ద్రవ్యంగా మారుస్తున్నారు. ఆ సంఖ్యను పెరిచి ప్రకృతిలో విడిగా దొరకని కొత్త మూల ద్రవ్యాలను ప్రయోగశాలల్లోనే తయారు చేస్తున్నారు. పంచ భూతాలు పోయి 92 భూతాల య్యాయనుకొంటే, వాటికి మరో 15 దాకా కొత్త భూతాలు (elements) కలిపారు. పరమాణువు లోపలి శకలాలు (Sub-atomic particles) మొదట అనుకున్నట్లు 3 రకాలు కాదనీ, వాటి సంఖ్య 200కు పైగా వున్నదనీ, అవి ఫలానా ఫలానా అనీ కనుగొన్నారు. పరమాణువు అభేద్యమైనదని మొదట అనుకొన్న శాస్త్రజ్ఞులు చివరకు దాన్ని భౌతిక రాసాయనిక ప్రక్రియల ద్వారా విచ్ఛిన్నం చేయగలిగారు. విశ్వ నిర్మాణ శకలాల ఆదిమ రూపు కోసం అన్వేషిస్తూ, అవి 6 రకాల క్వార్కులని కనుగొన్నారు. ఈ క్రమంలో ఆధునిక విజ్ఞానం శాఖోపశాఖలుగా విడివడి ప్రకృతి రహస్యాల ముసుగు తీసివేస్తూ ముందుకు సాగుతున్నది. కాగా, అణువులు రైటా, అనంతర ద్రవ్యం రైటా అని శుష్కతర్కం చేస్తూ కూర్చుంటే, ప్రకృతి నిర్మాణ రహస్యాలు రహస్యాలుగానే వుండిపోతాయి. పూర్వులు నమిలి పారేసిన పిప్పిని నమిలి నెమరువేస్తూ కాలం వెళ్లబుచ్చుకుంటే, సత్యాలు వెల్లడవతాయనే భ్రమలు ఇప్పటికీ కొందరిని వేధిస్తున్నాయి. అలాంటి భ్రమలు హేతువాదులకు, మానవవాదులకు వుండవు ఆధునిక శాస్త్రం నిరవధికంగా అందిస్తున్న వైజ్ఞానిక సమాచారం ఆధారంగా వారి దార్శనిక నిర్ణయాలూ, దాన్ని అనుసరించే ఆచరణ మార్గమూ వికసిస్తుంటాయి.

పదార్థ విజ్ఞాన మనేది (matter) ద్రవ్య రూపకమైన సత్తాకు సంబంధించినదే కాని, పదాల అర్థాలకు (meaning of words) సంబంధించింది కాదు. అందులో దేనికి బదులు దేన్ని వాడాలో తెలియని మహానుభావులు భావ పదార్థమనే విచిత్ర సమాసాన్ని కూడా ప్రయోగిస్తున్నారు. ఏ సాము గరిడీలైనా విషయాల మీద చేస్తే బాగుంటుంది కాని, భాష మీద కాదనిపించింది.

## తత్త్వ దర్శనం :

'తత్త్వం' అంటే అందులో వున్నది అనే అర్థం చెపుతుంటారు. అంటే, వాస్తవికత మీద ఆధారపడిన దానినే తత్వమంటారని దాని భావం. అంటే, తత్వమంటే సత్యమేనన్నమాట కాబట్టి, వాస్తవికతను పగల గొట్టుకొంటూ లోపలకు వెళుతుంటే అది లభిస్తుంది తప్ప, మాటల అర్థాల్ని పగల కొట్టుకుంటూ కూర్చుంటే అది దొరకదు. అలానే దర్శనం కూడా. దర్శనమంటే సత్యదర్శనమే సత్యాన్ని చూడడమే. అయితే, సత్యం స్థాణువు కాదు. మన జ్ఞాన పరిధి పెరిగే కొలదీ అది వికసిస్తూనే వుంటుంది. ఏనాడో ఏదో చూచామని ఎవరో భ్రమపడి ఏమేమో గిలికితే, వారికి సత్య ద్రష్టలు (సత్యాన్ని చూచినవారు) అనే బిరుదాల్ని తగిలించి, వారి సూత్రాల పీట ముడుల్ని విప్పుకుంటూ కూర్చోవడం సత్యాన్వేషణ కాదు.

తత్వమన్నా, సత్యమన్నా ఈ వస్తుమయ జగత్తుకు సంబంధించినవి కావన్నట్లుగా వాగాడంబరాన్ని ప్రదర్శించడం తాత్వికమూ కాదు, దార్శనికమూ కాదు.

## జగత్కారణం:

జగత్తు స్వతస్సిద్ధమైన నదని ఆదిమ భౌతికవాదులే చెప్పారు. దీనికి అతీతంగా, అన్యంగా, భిన్నంగా దీనికి కారణమైన దొకటి వున్నదనే భావ దౌర్బల్యం వారిలో లేదు. అలాంటి వెలుపలి కారణాన్ని, ఆది కారణవాదాన్ని మొదట ప్రవేశ పెట్టినవారు ముడి ఆస్తికులు కాగా, ఈ నాడు

దాన్ని పట్టుకొని ప్రచ్ఛన్న రూపాల్లో ప్రాకులాడుతున్నవారు ముసుగు ఆస్తికులు. ప్రతి కార్యానికీ కారణం వుండాలి కాబట్టి, జగత్తును కార్యంగా తీసుకొంటే దానికి వెలుపల దాని కారణం వుండ నవసరం లేదా? అనే ప్రశ్నను ఆ వర్గం వారే లేవనెత్తారు. ఆ ప్రశ్నలోని అనవస్థాదోషం వారికి అంతుపట్టలేదు. అంటే, కారణ కారణాన్ని వెదక్కొంటూపోతే, అది ఎక్కడా ఆగదు. అదే ''అనవస్థ''. ఆ వెదకులాటకు అంతు వుండదు. ఆది కారణంగా ఒక జగత్కారణుణ్ణి ప్రతిపాదించుకుంటే ఆ సమస్య తీరదు. ఆ జగత్కారణుడికి కారణ మేమిటన్న ప్రశ్న ఆ ప్రతిపాదనలోనే దాక్కొని వుంది ఈ ప్రశ్నను లేవనెత్తిన ఆదిమ భౌతిక వాదులకే ఈ నాటికీ ఏ ఆస్తికుడూ, భావవాదీ సమాధానం చెప్పలేదు. జగత్కారణాన్ని జగత్తుకు వెలుపల వెదకడమే తప్పు కాబట్టి, ఏ ఆస్తిక భావవాదికీ, ఎన్నటికీ ఆ ప్రశ్నకు సమాధానం దొరకదు. అన్నీ కార్యాలే (సంఘటనలే) అయిన జగత్తును మానవుడు అవగాహన చేసుకోవడంలో కారణభావన ఉనికి వచ్చిందన్న వాస్తవం వారి తర్కానికి దొరకదు. నిజానికి జగత్తుకు ముందు లేదు, వెనుక లేదు, వెలుపల లేదు. ప్రదేశం; కాలం, ద్రవ్యం, సంఘటనలు అన్నీ అందులోనివే. ఉన్నది జగత్తే. ఉన్నదంతా జగత్తే. దానికి పుట్టుక లేదు, చావు లేదు. వస్తు పరివర్తన దశలకు మనం పెట్టుకొన్న పేర్లే చావు పుట్టుకలు. కారణ భావన మనిషిది. సంఘటనల క్రమాన్ని అవగాహన చేసుకోవడం కోసం ముందటి సంఘటనకు మనిషి పెట్టుకొన్న పేరే కారణం. మనిషి లేనప్పుడు కారణభావనే లేదని ఇంతకు ముందే చెప్పుకొన్నాం. అంటే, విశ్వానికివేరే కారణం వున్నదనే భావన సరైనది కాదని దీనివల్ల తేలుతుంది.

### కారణ బహుత్వం:

ఇక్కడ మన కొక ప్రశ్న ఎదురువస్తుంది. ప్రకృతిలో జరిగేవి అన్నీ సంఘటనలే (కార్యాలే) అయితే, కారణాలు ప్రకృతిలో విడిగా లేకుంటే, హేతువాదులు కార్యకారణవాదాన్ని అనుసరించడంలోని ఔచిత్యం ఏమిటి? అని

నిజానికి, ఒకస్థాయిలో యీ ప్రశ్నకు సమాధానం మనం ఇంతకుముందే చెప్పుకొన్నాం. అయినా, మరోసారి జ్ఞాపకం చేసుకొందాం. ప్రకృతి సంఘటనలు మనస్ప్రుహలోకి వస్తున్నాయంటే, వాటి క్రమమే మన అవగాహనలోకి వస్తున్నదని అర్థంచేసుకోవాలి. ఆక్రమం మన అవగాహనలోకి వస్తున్నదంటే, ప్రకృతి మనకు అర్థమవుతున్నదనీ, ఏ సంఘటనకు ముందు ఏ సంఘటనవున్నదో - ఏ సంఘటన తర్వాత ఏ సంఘటన వస్తున్నదో అందులో ఒక సంఘటనను సాధించడానికి మనం ఏ సంఘటనను ఆశ్రయించాలో అందుకు మనం ఏమేమి అంచనాలు వేసుకోవాలో గ్రహిస్తున్నా మన్నమాట. ఇక్కడే మనం ముందటి సంఘటనను కారణంగానూ, దాన్ని అనుసరించే సంఘటనను కార్యంగానూ అన్వయించుకొంటాం. అదే, హేతువాదం కార్యకారణవాదాన్ని అనుసరించడంలోని ఔచిత్యం.

ఈ కార్యకారణవాదాన్ని మన దై నందిన జీవితంలోని సంఘటనలకు అన్వయించు కొనేటప్పుడు, సహజంగా మనం కారణబహుత్వాన్ని (Plurality of causes) పరిగణలోకి తీసుకొంటాం. ఎందుకంటే, ఏ సంఘటనా ఒంటరిగా జరగదు. సంఘటనలమయమైన ప్రకృతిలో ఒక సంఘటనను మరోసంఘటన, లేక అనేక ఇతర సంఘటనలు ప్రభావితం చేస్తాయి. ప్రతిసంఘటనా అనేకానేక సంఘటనలవల్ల ప్రభావితమవుతుంది. ఈ సందర్భంగా, ఒక సంఘటనల క్రమాన్ని ప్రభావితం చేసే మరో సంఘటనల క్రమాన్ని అందుకు దోహదకారిగా మనం గుర్తిస్తాం. దాన్నే బాహ్యకారణంగా పరిగణిస్తాం. దీన్ని అవకాశంగా తీసుకొని కొందరు తార్కికులు ఆదికారణం

విషయంగా కొంత గందరగోళం సృష్టించడానికి ప్రయత్నిస్తారు. లేని బాహ్యాకారణాన్ని మోసుకువచ్చి విశ్వానికీ, మొత్తం అస్తిత్వానికీ దాన్ని కారణంగా చూపెడతారు.

విశ్వానికి బాహ్య కారణం లేదనేది పచ్చి వాస్తవం. అందుకే మనం అంతర్గత కారణం మీద నొక్కు పెడుతున్నాం. కార్యకారణ వాదాన్ని పెడదారి పట్టనీయకుండా జాగ్రత్త పడుతున్నాం అంటే, విశ్వంలో ఒకచోట జరిగే సంఘటనల ప్రభావం మరోచోట జరిగే సంఘటనల మీద వుండదని దీని భావం కాదు. విశ్వం ఉనికి, పరిణతులకు వెలుపల వేరే కారకశక్తి లేదనేదే దాని తాత్పర్యం. ప్రతి సంఘటన ప్రభావం అనంత సూక్ష్మ రూపంలోనైనా ఇతర సంఘటనల మీద వుంటుంది. నిశ్చలంగా వున్న నీటిమీద రాయివేస్తే, దాని చుట్టూ బయలుదేరే తరంగాలు (Ripples) వలయాలు వలయాలుగా గమనం చేస్తూనే వుంటాయి. యీ బాహ్య సంఘటనలూ నిరోధించకపోతే, అవి అలా నిరంతర యానం చేస్తూనే వుంటాయి. కాని, వాతావరణ ఒత్తిడి, నీటి ఒత్తిడి, భూమ్యాకర్షణ శక్తి వగైరాలు వాటి వురవడిని, ప్రమాణాన్ని క్రమంగా తగ్గించి వేస్తాయి. అలలు బయలుదేరడానికి కారణమేమిటి? అవి క్రమంగా తగ్గడానికి కారణమేమిటి? వాటి ప్రభావ పరిణామం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలన్నిటికీ శాస్త్రీయ సమాధానాలున్నాయి. కాని, 'ఓం'కార జపం చేస్తే వాటికి సమాధానాలు దొరకవు 'అసతోమా సద్గమయ' అని మంత్రాలు వల్లిస్తే సమాధానాలు లభించవు 'నమో బ్రహ్మాదిభ్యో' అని మొకరిల్లితే సమాధానాలు దొర్లుకురావు. తిమ్మతియ్యాల వల్ల సత్యావిష్కరణ కాదు.

## తప్పుడు కారణాలు:

మూఢ నమ్మకా లన్నీ తప్పుడు కారణాల వూహల వల్లనే బయలుదేరి కుదురుకొన్నాయి హేతువాదులు మూఢ నమ్మకాలను ఎదుర్కొంటున్నారంటే, తప్పుడు కార్యకారణ వాదాన్ని ఎదుర్కొంటున్నారని అర్థం చేసుకోవాలి. మూఢ నమ్మకాలయినా కారణాలు లేనివి కాదు కాని, వాటికి చూపబడే కారణాలు తప్పుడువి ఏ నమ్మకాలకైనా. వాస్తవిక ఆధారాలు కావాలి. చూపబడిన ఆధారాలు వాస్తవికంకావని మన ఇంగిత జ్ఞానంకాని, ఆధునిక విజ్ఞానం కాని రుజువుచేసి నప్పుడు వాటిని వదలుకోవాలి. అలా వదలుకోని మూఢ నమ్మకాలు సామాజికుల్లో కోకొల్లలుగా వున్నాయి. అలాంటి సామాజికులకు కార్యకారణ వివేకం కల్గించడమే హేతువాదుల ధ్యేయం.

ఉదాహరణకు స్ఫోటకాన్ని (Small-pox) తీసుకొందాం. ప్రజల వాడుకలో ఇది పోలేరమ్మ అనే దేవత ఆమెకు ఆకలయినప్పుడల్లా ప్రజలకు సోకి, వారిని చంపి తింటుంది. జాతర్ల పేరుతో జంతు బలులు, కుంభాలు సమర్పిస్తే, అవి తిని, ఆకలి తీర్చుకొని దేవత వెళ్లిపోతుంది ఏటేటా ఒక రుతువులో వచ్చి పోయే జబ్బుకు ఈ విధమైన లంకెవేశారు పూర్వులు. అ కార్యకారణ సంబంధం తప్పుడుదని తేలింది. తేలినా, ఇంకా ఆ మూఢ నమ్మకం ప్రజల్ని వదలలేదు.

సశేషం

---

One reason we have so much trouble attaining happiness is that we don't even know what it is. We keep trying to annihilate anxiety and other disturbances. But happiness has more to do with broadening your perspective, says a ground-breaking psychiatrist who blends Western and Eastern thinking.

**By Mark Epstein, M.D.**

# అడుగడుగున గుడివుంది

- భమిడిపాటి రామగోపాలం

ఓసారి సాయిబాబా అనే పేరుగల నా మిత్రుడొకడు నా దగ్గిర వందరూపాయలు అప్పు పట్టికెళ్లి రెండు నెలలయిపోయినా తిరిగి ఇచ్చేడు కాదని : అతని మీద ఒక పాత జోకు ప్రయోగించేను.

''నిన్ను చూసినప్పుడల్లా నాకు రాఘవేంద్రస్వామి జ్ఞాపకం వస్తాడు'' అన్నాను.

''మాకిద్దరికీ పోలికలేమీ లేవే!'' అని సాయిబాబా ఒక క్షణం ఆలోచించి ''మన క్లాస్‌మేటు రాఘవేంద్ర స్వామి సంగతేకదూ, నువ్వు చెబుతున్నావు? ఓహో, తెలిసింది. నా పేరు డైరక్టుగా దేముడిపేరే అయినట్టు అతనిది కూడా దేముడి పేరే - అందుకనా?'' అన్నాడు.

''అందుక్కాదు. అతను కూడా నాకు వంద రూపాయలు బాకీ వున్నాడు.'' అని నేను నవ్వుతూ చెప్పేసరికి సాయిబాబాకి పశ్చాత్తాపం లాంటిది ఏదో కలిగినట్టయింది. ''సాయంకాలం మీ అమ్మాయిని టైపు క్లాసు నుండి తీసుకు రావడానికి మా వీధికి వస్తావు కదా; అప్పుడు మా ఇంటికి రా; నీ వంద రూపాయలూ ఇచ్చేస్తాను'' అన్నాడు.

సరే; సాయంకాలం వెళితే సాయిబాబా వంద రూపాయలూ ఇచ్చేస్తాడు కదా అని ఆరోజు మా అమ్మాయి టైపు క్లాసుకి వెళ్లకపోయినాసరే ఆ వీధికి వెళ్లేను. సైకిలు రోడ్డువారని నిలబెట్టి సాయిబాబా ఇంటి గుమ్మం ఎక్కేను. సాయిబాబా లోపలెక్కడో వుంటే అక్కడికెళ్లేను. అతని చేతిలో ఏవో కాయితాలు పెట్టుకుని ఆస్తంతా పోయినవాడి మొహం పెట్టుకుని కూచున్నాడు. నన్ను చూడగానే ''మీ అమ్మాయి రాలేదా?'' అన్నాడు.

''అమ్మాయి వూసెందుకులే!'' అన్నాను.

''అది కాదు. మీ అమ్మాయిని టైపు క్లాసునించి పికప్ చైడానికి కదా నువ్వు రోజూ ఈవేళప్పుడు ఇటు వస్తావు!''

'రోజూ అంతే అనుకో ఇవ్వాళ నువ్వు రమ్మన్నావుకదాని వచ్చేను.''

''అవును కదూ; మరిచేపోయాను!'' అని నెత్తి కొట్టుకున్నాడు సాయిబాబా. ''చూడు'' అని చేతిలో ఉన్న కాగితాలు నాకు అందించేడు.

అది ఒక ఉత్తరం. నాలుగు పేజీలుంది. చేత్తో రాసిందే. అందుకున్న మరుక్షణం అది వాళ్ల నాన్నగారు అర్జంటుగా డబ్బు పంపమని రాసిన ఉత్తరం కాబోల్ననుకున్నాను. ''ఇది అడ్డం పెట్టుకుని నా వంద రూపాయల బాకీ తీర్మానం మళ్లీ మరికొన్నాళ్లు వాయిదా వేస్తాడు'' అని కూడా తెలిసిపోయినంత పనైంది.

కాని ఆ ఉత్తరం వాళ్ల నాన్నగారు రాసింది కాదు. అసలా ఉత్తరం ఎవరు రాసేరో తెలీదు. కింద (అంటే నాలుగో పేజీలో కింది భాగంలో) సంతకం ఏదీ లేదు. ''మీ శ్రేయోభిలాషి'' అని వుంది.

ఈ శ్రేయోభిలాషి ఏమిటంటాడంటేనూ.

ఫలానా రాష్ట్రంలో (''ఆంధ్ర ప్రదేశ్ కాదు'' అని విడిగా బ్రాకెట్లలో చెప్పాలి; పత్రికల బాణీలో), ఫలానా గ్రామంలో ఫలానా అమ్మవారు వెలసి యున్నారు. ఆ అమ్మవారు అసలు గంధర్వ వనిత. పైలోకాల్లో ఉన్న కాలంలో ఏదో కారణం వల్ల ఆ లోకాధిపతికి ఆవిడమీద కోపం

వచ్చి ''నువ్వు మానవకాంతగా జన్మించెదవు గాక!'' అని శాపం కలిసిన ఆర్డరు వేస్తే ఆవిడ జంబూ ద్వీపంలో, భరత ఖండంలో, గంగా గోదావరీ మహానదుల మధ్యను గల ఒక సీమలో ఒకానొక ధార్మిక, భాగ్యశాలి ఇంట జన్మించిందిట. యుక్తవయస్సు వచ్చేక సర్వాంగ సుందరిగా రూపుదిద్దుకున్న ఆమెను మరో సంపన్న కుటుంబానికి కోడలుగా పంపాలని ఆ తల్లిదండ్రులు నిశ్చయించేరుట. ఈ అమ్మాయికి తాను గంధర్వ స్త్రీననీ, శాపవశాత్తు మానవిగా జన్మించాననీ మాత్రమేకాక; మానవ సంసారంలో పాత్ర వహిస్తే శాపవిమోచనం కష్టమని కూడా తెలుసట. అంచేత తల్లిదండ్రులకి ఏదో చెప్పి వివాహం తప్పించుకోడమే కాక మన కుటుంబంలో దాన ధర్మాలు ఆచారం కనుక నా సమయాన్నంతా అలాగే వినియోగిస్తానని చెప్పి ఆ ఇంటి పూర్వార్జితం, పిత్రార్జితం అంతా ధర్మంచేసి చేసి చివరికి ఆ కుటుంబానికి తినడానికి తిండీ, కట్టడానికి గుడ్డా లేకుండా చేసిందిట. ''ఓసి జెష్టా!'' అని ఒకనాడు తండ్రే ఆమెని హత్య చేసేడట. ఆవిడ అసాధారణ వరప్రదాయినిగా మారి, మళ్లీ ఆ కుటుంబానికి ఐశ్వర్యం, సంపదా ఇచ్చిందిట. అపకారికి ఉపకారము చేయగల ఆ తల్లి చివరి కోరికగా తనకి ప్రతి పది ఆమడలకి ఒక గుడి కట్టించాలని కోరిందిట. ఈ కోరిక ఆ ఫలానా గ్రామంవారు తీర్చాలనుకుంటున్నారు గనుక ఈ ఉత్తరం అందినవారు ఆ గుడి నిర్మాణానికీ నిర్వహణకీ వంద రూపాయలు పంపడమే కాక; ఇలాంటి ఉత్తరాలు ఇరవై మందికి పోస్టు చెయ్యాలిట. ఇందులో ఏది చెయ్యకపోయినా ఈ ఉత్తరం అందిన సంసారంలో కష్టాలూ, పరాజయాలు, మృత్యువులూ ఖాయంగా వస్తాయనీ; చేసినవారికి సుఖాలూ, విజయాలూ, దీర్ఘాయువూ సంభవిస్తాయనీ -

''నీకిద్దామని నూరు రూపాయలు పోగుచేసేను కాని ఇలా అవుతుందనుకోలేదు'' అన్నాడు సాయిబాబా.

''వెనకటికెవరో; నీ బాకీ తీరుద్దామనే లాటరీ టిక్కెట్టు కొన్నాను. ప్రయిజు రాగానే నేనే పట్టుకొచ్చి నీ బాకీ తీర్చేస్తాను నువ్వు అనవసరంగా తిరక్కు - అన్నాడట-''

''నీకన్నీ వేళాకోళమే. ఇప్పుడు ఆలయ నిర్మాణానికి వంద రూపాయలు, మనియార్డరు చెయ్యడానికి పది; ఇరవై ఉత్తరాలు పోస్టు చెయ్యడానికి ఇరవై - మొత్తం 130 కావాలి. నా దగ్గిర నూరే ఉన్నాయి ఓ 30 ఇచ్చి వెళ్లు; అదీ ఇదీ కలిపి ఇచ్చేస్తాను'' అన్నాడు సాయిబాబా.

''గోవిందా, వంద రూపాయలు గోవిందా!'' అని లేచాను.

''బాగా జ్ఞాపకం చేసేవు. గోవిందరావు ఇవాళ్లే ఎరియర్సు అందుకున్నాడు. అతని దగ్గిర తీసుకోవచ్చు. ఆ కొరదలా ముప్పయి రూపాయలూ. పద. నీ సైకిలు మీద నన్ను మన గోవిందరావు ఇంటి దగ్గిర దింపి'' అని సాయిబాబా లేచేడు.

''నువ్వు గోవిందరావుని 130 అడుగు. నా వంద నాకిచ్చేసి 30 నువ్వు వాడుకో'' అన్నాను; గోవిందరావు ఇంటి దగ్గిర సైకిలు ఆపి.

''అవునుస్మీ!'' అని, ఇంకో వంద రూపాయలు అప్పుచేసే అవకాశం కనబడగానే, ఇంకో వంద రూపాయలు ఇంక్రిమెంటు వచ్చినంత సంతోషపడిపోయాడు సాయిబాబా.

తను ఎందుకు అప్పు అడుగుతున్నాడో ఆ కారణం వివరం సాయిబాబా గోవిందరావుకి చెప్పలేదు. 130 రూపాయలు అప్పు ఇచ్చి మమ్మల్ని గుమ్మందాకా సాగనంపిన గోవిందరావు ''ఉండండి, ఇప్పుడే వస్తాను'' అని లోపలికెళ్లాడు. అతను తిరిగొచ్చేటప్పటికి నేను సాయిబాబా ఇచ్చిన పది రూపాయల నోట్లు పదీ ఉన్నాయా లేదా అని లెక్కపెట్టడం అవుతోంది. ''ఓహో;

డబ్బు అవసరం నీకన్నమాట. నువ్వే డైరక్టుగా నన్ను అడగొచ్చు కదా? ఈ మాత్రం దానికి సాయిబాబా ఇంటిదాకా వెళ్లడం, అతన్ని సైకిలుమీద డబల్సు తొక్కుకుని తీసుకురావడం, మళ్లీ అతన్ని ఇంటిదగ్గిర దింపడం - హూ - ఎవడు చెప్పిన పని, ఇదంతా?'' అని గోవిందరావు నామీద నోరు పారేసుకున్నాడు. ఎంత చెప్పినా నమ్మలేదు

రావికొండల రావు తెలుగుమేష్టారి పాత్రలో ఇలాటిదే ఒక జోకు వుంది. తెలుగు మేష్టారు ఇంగ్లీషు మేష్టారిని ఓ యాభై అప్పు అడిగాట్ట. ఇస్తానని ప్రామిస్ చేసి, రేపు ఉదయం రమ్మన్నాట్ట. ఉదయం వెళ్తే సాయంత్రం రమ్మన్నాట్ట; మళ్లీ మర్నాడుదయానికి, మర్నాడు సాయంకాలానికీ వాయిదా వేసేడట నాలుగోసారి వెళ్లినప్పుడు తెలుగుమేష్టారికి వోర్పు చచ్చి ''ముష్టి యాభైరూపాయల ,కోసం ఎన్నిసార్లు తిప్పుతావు? అంత లేనివాడివైతే ఇచ్చుకోలేనని చెప్పలేకపోయావా?'' అంటూ జనాల్ని పోగేసి తిట్లకి లంకించుకున్నాట్ట. జనం అంతా ఇంగ్లీషు మేష్టారే ఇతనికి బాకీ అనుకుని ''ఇచ్చీవయ్యా, పాపం ఎన్నిసార్లని తిరుగుతాడు ఆయన?'' అని నచ్చజెప్పేశారుట.

గోవిందరావు నాకు క్లాసు తీసుకోడం అయిపోగానే సాయిబాబా చేతికి ఒక మనియార్డరు ఫారమూ 35 రూపాయలూ ఇచ్చేడు. ''రేపు నేనూళ్లో వుండను. ఈ ఎం.వో రేపు కట్టే'' అన్నాడు. మనీయార్డర్ ఫారంమీద అవతలివాళ్ల ఎడ్రస్ అచ్చువేసి ఉంది. ''ఇదేంటి?'' అని అడిగాను. గోవిందరావు ఒక అచ్చువేసిన కరపత్రం ఇచ్చేడు.

ఫలానా వూళ్లో సాయిబాబా గుడి కట్టేరుట. విగ్రహ ప్రతిష్ఠాపన కూడా అయిందిట. నిర్వహణ ఖర్చుల నిమిత్తం తృణమో ఫణమో కట్టమని ప్రార్థిస్తూ ఆలయ కమిటీ వారు పాంప్లెట్ వేశారు. ''ఈ పాంప్లెట్ అచ్చు వేసినందుకు, మనియార్డరు ఫారం కొన్నందుకూ, ఫారం మీద మా కమిటీ అడ్రస్ అచ్చు వేయించినందుకూ ఆలయ నిధుల్లోంచి కొంత ఖర్చు చేయడమైంది. కనుక మీరు 116 నుండి 2 రూపాయల వరకు ఎంత పంపినా సంతోషమే'' అని ఉంది అందులో.

''నయమే. పాంప్లెట్ పోస్టులో పంపినందుకు రూపాయి తప్పనిసరిగా కలపమని అన్లేదు'' అన్నాను.

''పాంప్లెట్ పోస్టులో రాలేదు. ఇందాకనేను స్కూటర్ మీద వస్తూవుంటే ఎర్రలైటు పడిందని ఆశీలుమెట్ట జంక్షన్ దగ్గిర ఆగినప్పుడు ఒకాయన నా జేబులో పెడుతూ - ఇంటికెళ్లి చదువుకోండి అని చెప్పేడు!''.

ఆ అయిదోరోజున సాయిబాబా కొడుకు దస్తూరీతో నాకు నాలుగు పేజీల ఉత్తరం వచ్చింది - అదే - గంధర్వకన్య, శాపం, మానవ జన్మ, హత్య, గుడి, వంద రూపాయలు చందా కట్టకపోతే మా కుటుంబం సర్వనాశనం అయిపోయే ప్రమాదం - అదంతానూ.

(20-5-92)

---




# స్త్రీ జన్మే ఒక శాపగ్రస్తమా?

★ ''శిశువులల్లా పశువుల కంటే హీనంగా ప్ర
వస్తుమార్పిడి విధానంలోకి మార్చి బానిస
నూరిపోసి... విరోధి కర్ణుడిని తమవైపు తిప్ప
ఎర చూపించి, నన్ను అంగడి బొమ్మను చే

★ ''వారు జూదంలో ఓడి, నన్నుకూడా ఫణంగ
తలలెత్తని నా భర్తలు, క్షత్రియవీరులా''?

★ స్త్రీ జన్మ నాటికీ, నేటికీ మారని నికృష్టపు బ్రత

## ఇది పాండవుల పట్టపు రాణి ద్రౌ

ద్రౌపది, సీత వరసగా మహాభారత, రామాయణాల నాయికలు. ఇద్దరు భూమి పుత్రికలే. సీత యజ్ఞభూమిని దున్నుతుండగా నాగేటిచాలులో దొరికితే, ద్రౌపది యజ్ఞాగ్ని నుంచే పుట్టుకొచ్చింది. ఇద్దరూ స్వయంవరం ద్వారానే వివాహమాడారు. నాటి మేటి విలుకాళ్ళనే వరించారు. ఒకరు పదునాలుగేళ్ళ వనవాసం చేస్తే, మరొకరు పద మూడేడులు చేశారు. ఏదో ఒక కారణంగా ఇద్దరూ కుంఠితలే అయ్యారు. పోలికల కంటే తేడాలే ఎక్కువ ఉన్నాయి. కారణం ఏమంటే భారత రామాయణాల విషయం, శైలి పూర్తిగా వ్యతిరేకాలు.

మహాభారతం ఇతిహాసం రామాయణం కావ్యం. అందుకని మహాభారతం పరిధి విస్తృతమైతే రామాయణం పరిధి సంకుచితం. భారతం రాజ్యాలను, నగరాలను, రాజులను, నదులు, అరణ్యాలను వర్ణించింది. కాల, దేశాలలో గూడ ఇది విస్తృతం. ఇందులో వచ్చే పాత్రలు ఎన్నో. నాయకులు, ప్రతినాయకులు, రాజకీయాలు, కుట్రదారులు, పిరికివాళ్ళు, జ్ఞానులు, బుద్ధి హీనులు, అనాకారులు, అందమైన వాళ్ళూ అందరూ ఉన్నారు. ఇందులో ఏ ఒక్కరూ పూర్తిగా మంచివారూ కాదు. పూర్తిగా చెడ్డవారూ కాదు. మంచి చెడుల సమ్మేళనం. ఇందులోని పాత్రలు మానవ మాత్రులు. మానవుల కుండే బలహీనతలన్నీ వీరికీ ఉన్నాయి.



సాహిత్య అకాడమీ ప్రచురణ (సౌజన్యంతో)

భావ పరిశీలన : రవీంద్రనాథ్

**ర్తించే యీ పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీని చరాస్తిగా**
**ం అయిదుగురు భర్తలకు సేవచేయటమే ధర్మమని**
**కోనుటకు నాపై ఆరో భర్త హక్కు కల్పిస్తామని**
**ంరు.''**
**ా పెట్టి, నిండు సభలో వస్త్రాపహరణం చేస్తుంటే**

**ంకై కుమిలిపోవాల్సిందేనా?**

## ంది దీన గాథ – వ్యాసుని అపూర్వ సృష్టి

రామాయణానికి వస్తే అలా కాదు ఇది ఒక ఆదర్శ పురుషుని మాత్రమే పొగడుతుంది. ప్రపంచంలో ఉన్న మంచినంతా ముద్దగా చేస్తే ఆ ముద్ద రాముడౌతాడు. ఆదర్శ పురుషు డెలా ఉండాలో చెప్పడమే వాల్మీకి ఉద్దేశం అలాగే ఆదర్శ మహిళను గూడ. అందుకని రామునిలాగే సీత. అస లంతే కాదు. ఇందులోని ప్రతి పాత్ర ఆదర్శవంతమైనదే. ఆదర్శ భ్రాత, ఆదర్శ సేవకులు, ఆదర్శవంతమైన ప్రజలు.

రామాయణం ముఖ్యంగా ఒక మనిషి కథ. ఈ మనిషిని వేరుగా చూపడానికి నేపథ్య పాత్రలన్నీ ఉపకరిస్తాయి. సీత బంధు వర్గంగాని, తలితండ్రులు గానీ మనకు తరువాత కథలో నామ మాత్రంగానే కనిపిస్తారు. సీత వనవాసానికి వెళ్తుంది. తిరిగి వస్తుంది. గర్భిణీగా ఉన్నప్పుడు ఆమె భర్త పరిత్యాగానికి గురవుతుంది. అంతిమంగా భూగర్భంలో కలిసిపోతుంది. సీత ఇలా కష్టాల పాలవుతున్నప్పు డెప్పుడూ మనం ఆమె పుట్టింటి నుంచి ఒక్క ఎదురు మాట వినం. ఆమె అనాథేమో అనిపిస్తుంది. జనకుడు జ్ఞానే, మహారాజే. అయినా ఆయన నుంచి ఉలుకు పలుకు వినపడవు.

ద్రౌపది కథ దీనికి పూర్తిగా విరుద్ధం. పిల్లలకోసం ద్రుపదుడు యజ్ఞం చేస్తాడు. యజ్ఞాగ్ని నుంచి పూర్తిగా ఎదిగిన ఇద్దరు సంతానం కలుగుతారు. ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. ఆ అమ్మాయే ద్రౌపది. ఆ రోజుల్లో ఆచారం ప్రకారం

తెగ సంతతి) - పేర్లు సతికు ఉంటు, [illegible] ([illegible]), [illegible] ([illegible]), పాంచాలి (పాంచాల రాకుమారి) - ఇవి ద్రౌపది పేర్లు. ఇవేకాక ఇంకా ద్రౌపదికి యాజ్ఞసేని ( యజ్ఞసేనుని కూతురు), ప్రిషతి ( యజ్ఞసేనుని భార్య ప్రిషతి వలన) అనే పేర్లూ ఉన్నాయి.

మహాభారతం మూడు తరాల రక్త సంబంధాల చరిత్రను వర్ణిస్తుంది. అంధుని వివాహమాడి కళ్ళకు గంతలు కట్టుకున్న గాంధారిని, ఆమెతో పాటు ఆమె మెట్టినింటిలోనే తిష్ఠ వేసిన శకునిని, వితంతువై తన పుత్రులను కంటికి రెప్పలా కాస్తున్న కుంతిని, పాండవులకు ముఖ్య సహాయకులుగా నిలబడ్డ ద్రౌపది తలితండ్రులను, ముత్తాత శంతనుని, అతని కొడుకు భీష్ముని, సోదరులు, అర్ధ సోదరులు, సవతుల బిడ్డలు, చిన్న-పెద్ద తరాలు, సోదరుల భార్యలు, మేనత్తలు, మేనమామలు, వైవాహిక బంధువులు, ఇంకా ఇతరులు అంతా అత్యంత సంకీర్ణ నేపథ్యంగా ఏర్పడి ద్రౌపది మూర్తిమత్వానికి, వ్యక్తిత్వానికి కొత్త కొలతలను ఆపాదించగా, కుట్రలకు, కుయుక్తులకు వైయక్తిక తగాదాలకు కుటుంబ తగాదాలకు వెనుకగా యాదవులు, కురులు, ద్రుపదులు ఉండి, పదును పెట్టడాన్ని మహాభారతం వర్ణించింది. వీటి అన్నింటికి పరాకాష్ఠ అయిన [illegible] వించింది.

రామాయణంలో మనకు ఈ విస్తృతి కానరాదు. ఇక్ష్వాకు అత్తమామలను, జనకులను, కేకయులను గూర్చి నామమాత్రంగానే చెబుతుంది. రావణుడు రామునికి బంధువు కాడు. అతడు వేరే ప్రపంచానికి చెందినవాడు. ఆధునిక కథలా ఇద్దరి గురించి మాత్రమే చెబుతుంది. ఇతర కుటుంబాల, రాజ్యాల, సామాజిక శక్తుల గురించి రామాయణం ద్వారా మనకు ఏమీ తెలియదు. కుటుంబాలు, ఈర్ష్యలు, ద్వేషాలు, రాజకీయాలు, సాంఘిక శక్తులు నాయికా నాయకులను ఎలా మలిచాయో మనకు తెలియదు.

ద్రౌపదిని వివాహమాడేవరకు పాండవులు అజ్ఞాతంలో ఉన్నారు. స్వయంవరంలో గూడ బ్రాహ్మణుల మధ్య బ్రాహ్మణ వేషంలో కూచున్నారు. అర్జునుడు మత్స్య యంత్రాన్ని ఛేదించడంతో అందమైన భార్యను గెలుచుకోవడమేకాక, బలమైన మిత్రులను ( ద్రుపదులను) సంపాదించుకున్నారు. ద్రౌపదిని పెళ్ళాడడంతో **పాండవులు అంతస్తును, రాజ్యాన్ని సంపాదించుకొన్నారు.**

సీతా స్వయంవరంలో రాముడు బ్రాహ్మణుల మధ్యలో కూర్చున్నాడే కాని, అజ్ఞాతంగా కాదు. పెళ్ళితో సీత అంతస్తు పెరిగిందే గాని, రాముని అంతస్తు కాదు. రాముడు పరిపూర్ణుడు, ఆదర్శ పురుషుడు కాన, అతనికి ఇక అదనంగా కావలసిం దేమీ లేదు.

పాండవుల నూతన అంతస్తుకు ద్రౌపది సజీవ ప్రతీక. ఐదుగురికి భార్యగా ఆమె వారి మధ్య ఐక్యతను పట్టుకు రాగలిగింది. ఆమెను గెలిచిన రోజున తల్లి అయిన కుంతి, నాటి భిక్షను ఐదుగురిని పంచుకోమంది. ఆ భిక్ష ద్రౌపది అని కుంతికి తెలియదు. తెలియకుండానే అలా అంది. కాని ఆమెను ఐదుగురు ఎలా పంచుకుంటారు ? ధర్మరాజు అర్జునునితో అన్నాడు, 'గెలిచింది నీవే కాబట్టి, ఆమెను నీవే చేసుకో!'' అప్పుడు అర్జునుడు ''అదెలా? నాకంటె పెద్దవారైన మీరిద్దరు ఉండగా, ముందుగా నేనెలా పెళ్ళి చేసుకుంటాను,? అందరికంటె పెద్దవారు కనుక మీరే చేసుకోండి'' అన్నాడు.

అర్జునుడు చెప్పిందే ఆ కాలానికి అనుగుణంగా ఉంది. వేద బ్రాహ్మణుల కాలం నుంచి పెద్దవాడికి పెళ్ళి కాకుండా చిన్నవాడు పెళ్ళిచేసుకోక పోవడం ఉంది. ఎందుకంటే పెద్దవాడు ఆస్తికి, అన్నింటికి వారసుడు. పైగా ఉత్తరాధికారి. శ్రాద్ధ కర్మలు చేయాలన్నా, కుటుంబ బాధ్యతలు నిర్వహించాలన్నా అతనికి వివాహం అయి ఉండాలి. అంతే కాదు. తమ్ముళ్ళు అన్న భార్యను పొందవచ్చు. కాని పెద్ద వాడు తమ్ముని భార్యను కోరడానికి వీలు లేదు. అందువలన ఆమెను అర్జునుడే గెలిచినా, ధర్మరాజు వివాహమాడడమే సబబు. ధర్మ రాజు ఒక్కడే ఆమెను వివాహమాడినట్లైతే, మిగతా నలుగురికి ఆమె మీద హక్కు ఎలాగూ ఉంటుంది. ఈ సమస్యపై చర్చ సాగుతున్నంతసేపు మిగతా నలుగురు కోర్కెతో ఆమె మీదనే కన్నులు నిలపడం కుంతి

గమనించి, వ్యాసునితో సంప్రదించి ఐదుగురికి భార్యను చేసింది. ద్రౌపది ఐదుగురిని ఒక త్రాటిమీద నడపగలిగింది.

ఈ సంగతినే తరువాత కర్ణుడు దుర్యోధనునికి ఎత్తి చూపాడు. దుర్యోధనుడు ఎప్పటిలాగే పాండవుల నాశానికి కుట్ర పన్నడం మొదలు పెట్టాడు. ''కుంతి పుత్రులను ముగ్గురిని, మిగతా ఇద్దరి నుంచి వేరు చెయ్యి. లేకపోతే ద్రుపదునికి డబ్బిచ్చి మనవైపుకు తిప్పు. లేదా మనం కనీసం భీముణ్ణైనా ఎలాగో చంపాలి'' అన్నాడు దుర్యోధనుడు. ''ఇవన్నీ నిష్ఫలాలే' ఏ తోడూ పాండవులకు లేనప్పుడే మనం వారిని ఏమీ చేయలేక పోయాం. ద్రుపదుడు అటువంటి ప్రలోభాలకు లొంగే రాజు కాదు. దృష్టద్యుమ్నుడు అర్జున భక్తుడు. ఇవన్నీ కాక, ద్రౌపది ఆ ఐదుగురికి భార్య అయ్యాక వారిని విడదీయడం ఎవరి తరమూ కాదు'' అన్నాడు కర్ణుడు.

పెళ్ళి అయ్యే వరకు కుంతి పాండవులను జాగ్రత్తగా కాపాడితే ఆ తరువాత ఆ పని ద్రౌపది చేసింది. పాండవులెవరికివైయక్తికంగా రాజ్య పాలనా వ్యవహారాలు తెలియవు. ధర్మజుడు జూదరి. భీముడు ముక్కోపి. అర్జునుడు విలుకాడే కాని అతనికి రాజ్యపాలన తెలియదు. మిగతా ఇద్దరూ పై ముగ్గురిని అనుకరించేవారు. కుంతి సోదరుని కుమారుడైన కృష్ణుడు వాటిని నిర్వహించాడు.

తన భర్తల పూర్తి వినాశనం నుంచి ద్రౌపది వారిని కాపాడింది. జూదంలో ధర్మరాజు, రాజ్యం, తమ్ములు, ద్రౌపదితో సహా అందరిని ఒడ్డి పోగొట్టుకున్నాడు. ద్రౌపదిని సభలోకి ఈడ్చుకు వచ్చి అవమానించారు. అవమానం పెచ్చు మీరిపోతున్న సమయంలో ధృతరాష్ట్రుడు జోక్యం చేసుకొని, ద్రౌపదికి మూడు వరాలిచ్చాడు. మొదటి వరంతో ధర్మరాజుని విడిపించి రాజును చేయమంది రెండో దానితో మిగతా నలుగురి స్వేచ్ఛను కోరింది ''నా భర్తలు స్వేచ్ఛను పొంది, ఆయుధాలు ధరిస్తే, నాకు అంతేచాలు'', అంటూ ఆమె తనకై ఏమీ కోరుకోకుండానే, మూడో వరాన్ని తిరస్కరించింది చాలా తెలివిగా మనం ఇప్పటి వరకు ప్రపంచంలో ఎంతో అందమైన స్త్రీలను గురించి విన్నాము కాని ఈనాడు ద్రౌపది అంత తెలివైనది, దీటైనది అయిన పనిని ఎవరూ చేయలేదు. మండిపోతున్న కౌరవ, పాండవుల సంబంధాలలో ఈవిధంగా ఆమె శాంతిని సాధించింది అవమాన భారంతో కుంగిపోతున్న పాండవుల నావను ఈ విధంగా ఒడ్డు చేర్చింది'' అన్నాడు కర్ణుడు ఈ సందర్భంలో. కర్ణుడు ఈ వ్యాఖ్యను దురుద్దేశంతోనే చేశాడు. కర్ణుడు ఆశించినట్లే భీముడు ఉడికిపోయాడు.

సీత, ద్రౌపదులు - ఇద్దరు వనవాసం చేశారు. పోలిక ఇంతటితో సరి. ద్రౌపది వనవాసం జూదరి అయిన భర్త రాజ్యాన్ని కోల్పోవడం వల్ల. కాని సీత వనవాసం అలాంటిది కాదు. ఆదర్శమూర్తి అయిన భర్త వాగ్దాన పాలనకోసం. అతడి ఆదర్శం కోసం. కైకేయి కుట్రతో రాముడు తండ్రికిచ్చిన మాట కోసం అరణ్యాలకు వెళ్ళాడు. దుఃఖంతో దశరథుడు మరణించాడు రాముడు అప్పుడైనా రాజు కావచ్చు. లేదా భరతుడు వచ్చి, తనకు రాజ్యం అవసరం లేదు, రాముడే రాజు కావాలి అని కోరినప్పుడైనా అతడు తిరిగి రాజ్యాన్ని చేపట్టి ఉండవచ్చు. న్యాయంగా, వ్యావహారికంగా రాముణ్ణి రాజ్యం చేపట్టకుండా అడ్డుకొనేది ఏదీలేదు. తండ్రికిచ్చిన వాగ్దానం కోసమే అతడు ప్రవాసం వెళ్ళాడు. తనకై తాను తనపై విధించుకొన్న కష్టం ఇది.

పాండవ ప్రవాస కారణం వేరు. పందెం కాసిన తరువాత దానికి కట్టుబడి ఉండాలి. కట్టుబడి ఉండకపోతే వారి శీలానికి అది శాశ్వతమైన మచ్చ అవుతుంది. ఆ సమయంలో ఎదురు తిరిగినా పాండవులకు ఎవరూ సహాయం వచ్చి ఉండేవారు కారు. వారికి వనవాసం తప్పనిసరి.

భోగ భాగ్యాలను భర్తలతో పంచుకొన్న ద్రౌపది తన పతులతో కష్టాలను గూడ పంచుకోవాలని వనవాసం వెళ్ళింది. సవతు లంతా వారి వారి పుట్టినిండ్లకు తమతమ పిల్లలతో వెళ్ళిపోయారు. తన బిడ్డలను తన పుట్టింటికి పంపి వేసింది. ఏదిఏమైనా దుఃఖ, అవమాన భారాలను నిస్పృహతో అనుభవించడం ద్రౌపదికి సరిపడదు. ఆమె శపించింది పిడికిళ్ళు బిగించి. కోపంతో ఉడికిపోయింది. అరణ్యంలో తన సోదరుడు

ధృష్టద్యుమ్నుడు ఒకసారి సందర్శించడానికి వస్తే ఎంతగానో దుఃఖించి, కోపంతో అరిచింది. ''నాకు భర్తలు లేరు, భ్రాతలు లేరు, తండ్రి లేడు. వారంతా ఉంటే, ఈ విధంగా నాకు అవమానం జరిగితే, చూస్తూ ఊరుకొనేవారా?'' అందరూ వెళ్ళిపోయిన తరువాత గూడ పగతీర్చుకోమని ధర్మరాజుని పురికొల్పింది.

అదృష్టవశాత్తూ, గతాన్ని తలచుకొని వాపోవడానికి ఆమెకు విశ్రాంతి లభించలేదు. మహారాజుల కూతురుగా, కోడలుగా, భార్యగా ఆమె చేయవలసిన విధులు ఆమె కున్నాయి. క్షత్రియ విహితమైన నిత్య కర్మల నిర్వహణలో ఆమె పాల్గొంది. అతిథేయ ధర్మాన్ని ఆచరించింది. ఖాళీ సమయాల్లో మునుల కథలు వింది. కాని లోలోపల ఆమె పగ రగులుతూనే ఉంది. వనవాసాంతంలో కృష్ణుడు ఓదార్చాడు : ''ప్రియసోదరీ! విచారించకు నీ పగతీరుతుంది''. సత్యభామ ద్రౌపదిని అక్కున చేర్చుకొని, ''ద్రౌపదీ! ఏడవకు. కౌరవ సతులు నిన్ను చూచి నవ్వడం చూచావు. వారి ఏడ్పును చూసే రోజు గూడ ఒకటి వస్తుంది'' అంది.

సీతా వనవాసంలో దుఃఖం, బాధలు లేవు. అది వారికి శృంగార యాత్ర. రాచనగరులో ఉంటే నౌకర్ల చాకర్ల మధ్య, ముగ్గురత్తలు ఇతర బంధువుల మధ్య, శృంగారానికి స్వేచ్ఛ ఉండేది కాదు. ఇప్పుడా బాదర బందీ లేకుండా సీతకు వనవాసం శృంగార యాత్రే (Honey Moon) అయింది. పైగా ఆమెకు, ద్రౌపదిలా పిల్లా పీచును వదిలి వచ్చామనే బాధ లేదు. నగరాలలో నివసించే ఆడపిల్లలు అరణ్యంలో శృంగారాన్ని గురించి కనే కాల్పనిక కలలు సీతకు నిజమయ్యాయి. గోదావరి ఇసుక తిన్నెలు, ఋషుల ఆతిథ్యం, అటవీ సౌందర్యం ఆమెకు ఉల్లాసాన్ని కలిగించాయి. వాల్మీకి తన కవిత్వాన్నంతా ఇక్కడే ప్రదర్శించాడు. కన్యగా వచ్చిన సీత, ఇక్కడే పరిణతి చెందిన మహిళగా మారిపోయింది. ఈ వనవాసం ఆమెకు ఎంత ఆదర్శవంతంగా, అందంగా ఉందంటే ఆమె గర్భిణిగా ఉన్నప్పుడు మళ్ళీ తాను అడవికి పోవాలనే కోరుకుంది.

రావణుడు సీతను ఎత్తుకుపోయిన తరువాత గూడ ఆమెను అతడు చెరచలేదు. అక్కడ గూడ ఆమె ఎదుర్కొన్న దుఃఖాలు, కష్టాలు కాల్పనికమైనవే. వేదవేదాంగ పారంగతుడు సంస్కారవంతుడైన రావణుని వల్ల ఆమెకు మానభంగ ప్రమాదం ఏమీ లేదు. అటువంటి రావణునికి మానవులను తినే రాక్షసులు ప్రజలుగా ఉండడమేమిటో మనకు అర్థం కాదు. కోతులు, ఎలుగుబంట్లు, రాక్షసులు యుద్ధంలో పాల్గొనడం కాల్పనికమే గాని వాస్తవం కాదు.

రామాయణం అధిక భాగం కాల్పనికం. కావ్య ప్రపంచానికి చెందింది. వాస్తవం కాదు. రాముడు ఆదర్శపురుషుడు. సీత ఆదర్శ మహిళ. రాముడు పితృభక్తి పరాయణుడు. సత్య పాలకుడు. ఏకపత్నీ వ్రతుడు. అతడు చాల సాహస వీరుడని చూపించాలంటే పెద్ద యుద్ధం ఒకటి జరగాలి. నాయిక కష్టాల్లో పడితే, ఆమెను రక్షిస్తేగాని నాయకుడు వీరుడు కాడు. ఇది అంతా సంస్కృత కావ్యానుశాసనా న్ననుసరించి రాయబడిందే. ప్రథమ ప్రేమ, పరిణత ప్రేమ, వియోగం - దానిలో వుండే విరహ శృంగారం, అన్నీ వరసనే వర్ణించబడాలి. ఒకసాహితీ ప్రక్రియా భాగంగానే యుద్ధమూ కల్పితమే. అంత యుద్ధం జరిగిందనుకొన్నా అయోధ్యపై దాని ప్రభావం ఏమీ ఉండదు. పైగా అతని పట్టాభిషేకం కోసం ఎదురు చూస్తూ ఉంటుంది ఆ నగరం.

కాని ద్రౌపది కష్టాలు మానవ సహజాలు. మానవ సమస్యలు, పైగా అవన్నీ భర్తల మూలాన వచ్చినవి. ఆమె అనుభవాలను కావ్య పరంగా కాక వాస్తవంగా వర్ణించారు. భర్త లుండీ లేనిదయింది. ('నాథవతీ అనాథవత్' అన్నారు ఆమెను) పెద్ద ఇంటి కూతురై అనాథ అయింది. సాహసవంతులైన మిత్ర రాజులుండీ, ఆమె ఒంటరిదైంది. అందుకని ఆమె పరిస్థితి దయనీయం. అవమానితురాలైన ప్రతిసారి భర్తలు, మామలు అంతా నిశ్శబ్ద సాక్షీ భూతులుగా నిలిచిపోయారేకాని, ఏమీ చేయలేక పోయారు. రెండుసార్లు ఆమె రక్షించ బడింది. ఒకసారి మాహాత్మ్యంతో, మరోసారి రహస్యంగా భీముని సహాయంతో.

మహా భారత యుద్ధం నిజమైంది. కవి కల్పన కాదు. జితులకు విజేతలకు చివరకు దుఃఖమే మిగిలింది. ద్రౌపది ఎదిగిన పుత్రులంతా యుద్ధంలో మరణించారు. తండ్రి పక్షం అంతా నిహతమైంది. మరణిస్తున్న దుర్యోధనుడు అన్నట్లు ''ద్రౌపది - ధర్మరాజు విధవల రాజ్యాన్ని ఏలారు'' ధర్మ రాజు సింహాసనం అధిష్టించే సరికి రాచనగరు అంతా బోసిపోయింది. మాతలు లేరు. పితలు లేరు. భ్రాతలు లేరు అత్తలు లేరు, కోడళ్ళు లేరు. అంతా పోయారు. అభిమన్యుని మరణానంతరం ఉత్తరకు పుట్టిన కొడుకు, ఉత్తర మిగిలారు. పాండవులు యుద్ధంలో గెలిచినా శాంతి మాత్రం మిగలలేదు. ఖాండవ దహనం చేసినందుకు అర్జునుని మీద పగతీర్చుకోవడానికి తక్షకుడు సిద్ధంగా ఉన్నాడు. యుద్ధం అయిన కొద్ది కాలానికే కృష్ణుడు విషాదకర పరిస్థితులలో అంతమొందాడు. **పాండవుల అంతంగాని ద్రౌపది అంతంగాని మహాభారత అంతం కాదు. అది ఒక యుగాంతం. ఆ యుగంలో సంభవించిన ప్రతి బాధను ద్రౌపది వైయక్తికంగా అనుభవించింది. ఆమె పుత్రులను కుయుక్తి కుట్రలతో చంపివేసినప్పుడు ఆమె చివరసారిగా ఏడ్చింది. ఆ తరువాత ఆమె కంఠం మనకు వినిపించదు.**

మహాభారత యుద్ధానికి అసలు కారణం ద్రౌపది అంటారు. ఈ అభిప్రాయాన్ని జైన పురాణాలు వ్రాసుకొంటున్నాయి. ఇది ఎంతవరకు సత్యమో తెలియదు. ఒక పురాణంలో అయితే ఇలా ఉంది.

కృత యుగంలో రేణుక కృత్య అయితే
సత్యయుగంలో సీత కృత్య అయింది
ద్వాపర యుగంలో ద్రౌపది అయితే
కలి యుగంలో ఇంటింట ఒక కృత్య ఉంది.

'కృత్య' అంటే రక్తదాహం ఉన్న రాక్షస స్త్రీ. ఈ రాసిన వానికి వాస్తవాలు పట్టినట్టు లేవు. యుద్ధాలన్నింటికి ఆడవాళ్ళు కారణమని వాళ్ళ కోసం మగవారు పోరాడుతారని భావించినట్లు కనిపిస్తుంది. రేణుక విషయానికి వస్తే ఆమె ఆ యుద్ధానికి అసలు కారణమే కాదు. హైహయుడు రేణుకని, ఆవును దొంగిలించాడు అది ఆమె తప్పు కాదు. తల్లి కోసం పరశురాముడు యుద్ధం చేశాడు. రామునికి రావణునితో యుద్ధం జరగడానికి ఏకైక కారణం సీత అందం అనేది మాత్రం సత్యం మహా భారత యుద్ధానికి వస్తే ముఖ్య కారణం మాత్రం ద్రౌపది కాదు. రాజ్యం కోసం అధికారం కోసం దాయాదుల మధ్య జరిగిన కీచులాట. అసలు బాల్యం నుంచి పాండవులకు కౌరవులకు పడదు ఇది ద్రౌపదితో వివాహానికి ముందు నుంచే ఉంది. పాండవులు అర్ధ రాజ్యమడిగినా, లేక అంతకంటె ఎక్కువ అడిగినా ద్రౌపదికి జరిగిన అవమాన కారణంగా కవ్వించడానికి అలా అడుగుతున్నా రనుకొనేవాళ్ళం. కాని పాండవులు యుద్ధాన్ని పరిహరించడానికే కొసకంట ప్రయత్నించారు ఐదు ఊళ్ళు చాలన్నారు. చివరకు ద్రౌపదికి జరిగిన అవమానానికి మిక్కిలిగా ఉడికిపోయే భీముడు కూడా అంతకంటే ఎక్కువ అడగలేదు. ద్రౌపది మాత్రం ఇలా అంది · **''నా జుట్టు పట్టుకు అతడు ఈడ్చాడు. ఆ నికృష్టపు హస్తాలను నా జుట్టుపై ఉంచిన వానిని మాత్రం క్షమించలేం''**

కృష్ణుని రాయబారం పంపారు. బిచ్చగాళ్ళలా ఐదు ఊళ్ళు మాత్రమే అడిగారు దుర్యోధనుడు సూదిమొ ఎ మోపినంతైన ఇవ్వనన్నాడు. యుద్ధం తప్పని సరి అయింది. అంతేగాని ద్రౌపదికి జరిగిన అవమానపరిహారార్థం మాత్రం యుద్ధం జరగలేదు ద్రౌపది యుద్ధాన్ని వాంఛించిన మాట నిజమే. అయితే పితృస్వామ్యంలో పురుషులు భార్యల మాట వినరు. అలాగే పాండవులు. వారు భార్య మాటలను చెవిని పెట్టలేదు. శాంతినే కోరారు.

కొన్ని విషయాలను చూస్తే అసలు ద్రౌపదికి ఏ మాత్రం ప్రాముఖ్యం లేదని అర్థమవుతుంది. కర్ణుడు కనుక పాండవ పక్షానికి వస్తే, ద్రౌపదిని, ఆమెతోపాటు రాజ్య భాగాన్ని అతనికి ఇస్తామని కృష్ణుడు చేసిన దౌర్భాగ్యపు ప్రతిపాదన అసలు ద్రౌపదికి తెలియదు. కొంతమంది మాత్రం అటువంటి ప్రతపాదన ద్రౌపదికి ఇష్టమే నంటారు. ఎందుకంటే ఆమె కర్ణుణ్ణి రహస్యంగా ప్రేమించిందట. ఈ అభిప్రాయానికి అసలు ఆధారమే లేదు. మహాభారతం ఏ పాత్రను ఆదర్శీకృతం చేయదు. ఉన్న ఒసగులొసగులను పూర్తిగా చెబుతుంది

అలాంటప్పుడు, ద్రౌపది రహస్యంగా కర్ణుని ఇష్టపడుతుంటే ఆ సంగతి భారతం బాహాటంగానే చెప్పేది. మహాభారతం క్రిటికల్ఎడిషన్‌లో ఈ సంగతి ఎక్కడా ప్రస్తావనకు రాలేదు. తరవాత వచ్చిన జైన పురాణంలో ఈ అభిప్రాయం కనిపించింది. ద్రౌపదిపై అలాంటి అనుమానానికి ఆస్కారమే లేదు.

కాని సీత విషయంలో పరిస్థితులు ఆమె రావణాసురుని విషయంలో సంస్కారవంతుడైన మానవత్వం మూర్తీభవించిన సంపూర్ణ పురుషుడని కొంత చనువు చూపించ వచ్చుననే అనుమానానికి దారి తీశాయని, రాముడు ఆమెను అగ్ని పరీక్షకు గురిచేశాడని చెప్పేరాతలు మహాభారతం చెప్పిన రామాయణ కథలో కనిపించవు. సీత శీల పరీక్ష, సీతా పరిత్యాగం నిజంగా జరిగి ఉంటే మహా భారతం వాటిని పేర్కొని ఉండేది బహుశః మూల రామాయణంలో ఇవి లేకపోయి ఉండాలి.

రామాయణం ఇతిహాసం కాదు. అది ఆదర్శంగా ప్రజలకు చెప్పిన కావ్యం. కావ్య లక్షణాలను పుణికి పుచ్చుకొంది. నాయికను శంకించడం, శంకానివృత్తి, పునస్సమాగమం - ఇది కావ్య నిర్మితి. కాని రామాయణం చివరలో ఈ సూత్రాన్ని పాటించలేదు. తన సచ్ఛీలతను రుజువు చేసుకోవడానికి సీత మరో దారి తొక్కి ఉండవలసింది. కాని ఆ విషాదాంతాన్ని భారతీయులు ఇప్పటికీ జీర్ణించుకోలేక పోతున్నారు. ఇక్కడ ఒక ప్రశ్న ఉంది. సీతా పరిత్యాగాన్ని వాల్మీకి ఎందుకు అనుమతించినట్లు? రాముడు ఆదర్శ పురుషుడు, ఆదర్శ సోదరుడు, ఆదర్శ భర్త. అటువంటి ఆదర్శ రామునికి మరో పరీక్షకూడా పెట్టాలని కవి భావించి ఉండవచ్చు. ''భార్యపై ఉన్న స్వార్థ ప్రేమా? - ప్రజాభిప్రాయమా? లేక రావణాసురిని పై సీత కున్న సదభిప్రాయమనబడే వాదన రాముని మనస్సులో పీకుతుందా? - ఏది ముఖ్యం'' అనే పరీక్షలో సీతను పరిత్యజించి రాముడు పరీక్షల్లో కృతార్థు డయ్యాడు. అయితే రాముని నిర్ణయాన్ని మనం పూర్తిగా అంగీకరించలేం. ప్రజాభిప్రాయం పేరుతో ఒక నిస్సహాయురాలిని నిర్దయగా వదిలివేయడం రాముడంతటి వాడికి తగిన పనేనా? సీతా పరిత్యాగానికి మారుగా రాజ్య పరిత్యాగం చేసి ఉండవచ్చుగదా! కాళిదాసు, భవభూతి, ఇంకా ఇతర కవులు సీతా పరిత్యాగం అన్యాయమే అన్నారు. ఇ ది రామునికి మచ్చ. ఇప్పటి వరకు రామునికి ఛాయగా మాత్రమే ఉన్న సీతకు తన బాధలను, అవమానాలను, దుఃఖాలను తనంతట తాను ఎదుర్కొనే అవకాశం వచ్చింది. తాను సర్వస్వతంత్ర వ్యక్తి అయింది. నిండు మనిషి అయింది.

ద్రౌపదికి ఇటువంటి సంఘటన ఎదురు కాలేదు. ఆమె కష్టాలు, అవమానాలు వాస్తవమైనవి. కావ్యానికి అలంకారం కోసం, నాటకీయత కోసం అతికినవి కావు. యీ నాటికి ప్రతి సంసారంలో ఏదో రూపంలో జరుగుతున్నవి ? వాటి పరిష్కారం మామూలు వాస్తవిక ప్రపంచంలో జరిగినట్లుగానే జరిగింది. ఇద్దరూ భూమి పుత్రికలేఅయినా, ద్రౌపది ఎప్పుడూ నేల విడిచి సాము చేయలేదు. ఆమె వ్యక్తిత్వం, మూర్తిమత్వాలకు తన వివాహం, తన కుటుంబం, తను పుట్టిన, మెట్టిన ఇళ్ళే ఆమెను నిర్వచించాయి. సుభద్రను అర్జునుడు పెళ్ళిచేసుకున్నప్పుడు మామూలు వాస్తవ స్త్రీలాగే అర్జునుని మీద అరిచింది, అలిగింది. కాని సవతుల మీద అసూయను ప్రదర్శించకుండా హుందాగా బహు నిగ్రహంతో వ్యవహరించింది. సీతకు సవతి బాధ లేదు.

సీత, ద్రౌపది - ఇద్దరూ ఘోరమైననేరాలు చేశారు. ఫలితాలు అనుభవించారు. మాయలేడి ఉదంతంతో సీత లక్ష్మణునికి దురుద్దేశాలను అంటగట్టి, అతనిని పంపివేసింది. రావణుడు సీతను ఎత్తుకు పోవడానికి ఇది వీలు కల్పించింది. అసలు రావణుడు సీతను ఎత్తుకుపోయింది ఆమెను చెరచడానికి కాదు. తన సోదరిని చూసి నవ్వినందుకు కసితో. ద్రౌపది గూడ తను గౌరవించాల్సిన వ్యక్తిని చూసి నవ్వింది. దుర్యోధనుడు మయసభలో నీటిని చూసి నేల, నేలను చూసి నీరు అని భ్రమించినప్పుడు అతన్ని చూసి అందరి ఎదుట మొరటుగ నవ్వింది. ఫలితం అనుభవించింది.

భీముడు కీచకుని చంపాడు. ఈ విషయం ఆమె భటులకు తెలియచేసింది. ఆ సమయంలో ఎక్కడైనా ఒక మూల ఉండవలసిన ఆమె, ఇంకా కసి తీరక, కీచకుని శవ యాత్రను చూడడానికి వచ్చింది. అప్పుడు కీచకుని సోదరులు ఆమెను చూసి, కీచకుని చితిమీదనే ఆమెను దహనం చేయాలని పట్టుకు పోయారు.

మళ్ళీ భీముడే ఆమెను రక్షించవలసి వచ్చింది. ''నా శత్రువు మరణించాడు. కసిదీర అతని శవాన్ని చూచెదనుగాక'' అని భూమి పుత్రి కాక మరెవ రనుకుంటారు?

కాని ద్రౌపది చేసిన మహాపరాధం ఒకటి ఉంది:

ధర్మరాజు ద్యూతంలో ఓడినప్పుడు, దుర్యోధనుడు ద్రౌపదిని సభకు తీసుకు రమ్మని సేవకుని పంపుతాడు. ''ధర్మజుడు తన్నొడ్డి నన్నోడెనా? నన్నొడ్డి తన్నోడెనా?'' - ఈ సంగతి కనుక్కొని రమ్మని ఆ సేవకుని తిప్పి పంపుతుంది ద్రౌపది. అప్పుడు దుర్యోధనుడు ఆమె సభలోకి వచ్చి ఆ ప్రశ్నవేస్తే సమాధానం లభిస్తుందంటాడు. ఆమె రానని నిరాకరించినప్పుడు దుశ్శాసనుడు ఆమెను ఈడ్చుకు వస్తాడు. ఆమె సభలో దుఃఖిస్తూ నిలబడి అదే ప్రశ్నను తిరిగి సభకు వేసింది.

ద్రౌపది అడిగిన ప్రశ్న న్యాయపరంగా చాలా సంక్లిష్టమైంది. భీష్ముడు గూడ ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయాడు. ద్రౌపది అంతరార్థం ఏమిటంటే, ధర్మరాజు ముందుగా తనను పందెం ఒడ్డి ఓడిపోయి వుంటే, ఓడినవాడు బానిస అవుతాడు గనుక, ఇక ఆ తర్వాత బానిసకు ఏ హక్కూ ఉండదు గనుక, అతడు ఆ విధంగా ద్రౌపది మీద హక్కు కోల్పోతాడు గనుక, ద్రౌపదిని పందెం ఒడ్డే ప్రశ్న ఉదయించదు. ఒక రకంగా ఇది నిజమే అయినప్పటికీ, ఆ రోజులలో బానిసలకు గూడ భార్యలు ఉంటారనే సంగతి విస్మరించరాదు. ఆ ప్రకారం చూస్తే అతడు బానిస అయిన తరవాత గూడ ఆమెను పందెం కాసే వీలుంది. ఇందులో బానిస-యజమాని హక్కులకు సంబంధించిన చిక్కు ముడిపడి ఉంది. యిది ఆటవికన్యాయం అనే వాదన కూడా వుంది.

అసలు ద్రౌపది అడిగిన ప్రశ్న దారుణమైనదే కాక బుద్ధిహీనమైంది కూడా. భీష్ముడు కనుక, ''తాను బానిస అయిన తరువాత గూడ ధర్మరాజుకు ఆమెపై, హక్కు ఉంది'' అని చెప్పినట్లయితే ఆమె బానిసతనం నుంచి ఎలాగూ తప్పించుకోలేదు. అలాకాక బానిసకు భార్య మీద హక్కు లేదని భీష్ముడు చెప్పినట్లయితే ఆమె విధవతో సమానమవుతుంది. భర్త ఉండీ లేనిదవుతుంది. (నాథవతి అనాథవత్). విధవలు పుట్టింటిలో ఉండవలసిందే. పుట్టింటిలో నాటి విధవల స్థితి మహాదారుణం. ఈ చిక్కులన్నీ భీష్మునికి తెలుసు. అందుకే అతడు మాట్లాడలేదు. తలవంచుకున్నాడు. ధర్మరాజు ఈ ప్రశ్న విని సిగ్గుతో తలవంచుకున్నాడు. అయినా ఆమె పండితురాలులా న్యాయపరమైన సాంకేతిక విషయాలను చర్చిస్తూనే ఉంది. అంతకంటె తన మర్యాదను కాపాడి దయచూపమని ప్రార్థించే తత్వమామెకు లేదు. భర్తల గౌరవం కాపాడుటకే ఆ త్యాగం చేసింది.

ద్రౌపది వస్త్రాపహరణం జరుగుతూంది. ఆ క్షణంలో ఏ దేవుణ్ణీ, మనిషినీ పిలువలేదు. విశ్వమంతా ఒక్కసారి జాగరితమై కోక తరువాత మరో కోకను ఇస్తూనే ఉంది. అయినా ఆమె ఆ ప్రశ్నను అడగడం మానలేదు. అప్పుడు దుర్యోధనుడు కుటిలంగా నవ్వుతూ, ''ఆ ప్రశ్నను నీ మగని నడుగు, అతని తెలివి తేటల మీద మాకు విశ్వాసం ఉంది'' అన్నాడు. దుర్యోధనుని జిత్తుల మారితనం ధర్మజుని ఇబ్బందిలో పెట్టింది. ధర్మరాజు ఏమీ సమాధానం చెప్పలేదు. అవమానం పరాకాష్ఠ చేరింది. దుశ్శాసనుడు చేతులు పీక్కుపోయి, ప్రక్కకు తిరిగాడు. అప్పుడు విదురుడు బాధా తప్త మనస్కుడై ''ఇది చాల దూరం పోతుంది, ఇప్పటికైనా జోక్యం చేసుకొని జరుగుతున్న దానిని ఆప''మని ధృతరాష్ట్రుని కోరాడు. ధృతరాష్ట్రుడు ద్రౌపదిని విడిపించి, ఆమెకు మూడు వరాలు ప్రసాదించాడు. ఆ వరాలతో ఆమె భర్తలను విడిపించుకొంది.

ఆమె ఆ విధంగా సభలో అతి తెలివిని ప్రదర్శించడం ఎవరికీ నచ్చలేదు. ధర్మరాజు దానిని ఆ జన్మాంతం మరవలేకపోయాడు. సభలో ఆమె ప్రదర్శించినవైదుష్యం ఆమెకు తెలియకనే ధర్మరాజును అవమానించింది. అంతమంది పెద్దల సభలో నవవధువైన తాను అలా మాట్లాడి ఉండకూడదనే సంగతి ఆమెకు అవగతమై ఉండవలసింది. అన్నింటిని మించి, పెద్దలను ఇబ్బంది పెట్టగల ప్రశ్నలను తాను వేయగలదు, వాటిని అర్థం చేసుకోగలదు అనే అహంభావాన్నే సూచిస్తుంది. ఇది క్షమించరానిది. అరణ్య పర్వంలో ధర్మరాజు ఆమె ''మహిళా విదుషీమణి'' అన్నాడు. ఆ విశేషణం క్షత్రియ వధువుకు శోభ గూర్చేది కాదు. గాంధారి, కుంతి అంటే, వాళ్ళు పెద్దవాళ్ళు, అనుభవజ్ఞులు, అందుకని తమ బిడ్డలకు సలహాలివ్వగలిగారు. ఒక నవ

వధువు పెద్దల సభలో ఇలా తెలివి తేటలు ప్రదర్శించడం ఆమె సరళ సహజత్వాన్ని, వ్య భూమి పుత్రికా తత్వాన్ని మాత్రమే చెబుతుంది.

తరువాత ఆమె చేసిన మరో తప్పిదం ఉంది. దీనిని ధర్మరాజు బహిరంగంగానే ఆమెకు అర్థమయ్యేట్టు చేశాడు. కృష్ణ నిర్యాణానంతరం పాండవులు ఈ భూమి మీద ఉండలేకపోయారు. అంతిమ యాత్రకు ఒడికట్టారు. గంగను దాటారు హిమాలయాలను ఉత్తరించారు పీఠ భూమిని చేరుకున్నారు ఒకరి వెనుక ఒకరుండగా ఆరుగురు కొన్ని నెలల పాటు నడిచారు ఒకరోజు ద్రౌపది పడిపోయింది. ''ఆమె ఎందుకు పడిపోయింది?'' అని భీముడు బుద్ధిలేని ప్రశ్న వేశాడు. అది వారి అంతిమయాత్ర అని, అందరూ కలిసే కర్మకు విహిత గమ్యాన్ని చేరలేరని మానవ బంధాలు ఇక్కడ తెగిపోతున్నాయని, అతనికి తెలియదా? ఇంకా కొద్ది అడుగుల దూరంలో మిగతా వారూ పడిపోయారు ఒక్క ధర్మరాజు, అతని కుక్క మాత్రమే ముందుకు సాగిపోయారు. భీముని ప్రశ్నకు సమాధానంగా, ''ఆమె అందరిలోకి ఎక్కువగా అర్జునుణ్ణి ప్రేమించింది,'' అని దెప్పి పొడిచాడు. వెనుదిరిగి చూడ కుండా ధర్మరాజు ఇలా సమాధానం చెప్పాడు

ద్రౌపది స్పృహను కోల్పోలేదు. భీముని ప్రశ్నను, ధర్మరాజు సమాధానాన్ని - రెండింటిని విన్నది. గతం ఆమె కన్నుల ముందు కనిపించసాగింది. ధర్మరాజు మాటల్లో బాధను, ఏహ్యతను గుర్తించింది ఇంతకు ముందు ఎప్పుడూ అతడు తన బాధను వెళ్ళ గక్కలేదు. అతని బాధను గుర్తించింది. ఒక్క క్షణం పాటు పరితపించింది. అదీ ఒక్క క్షణం మాత్రమే! తనలో తాను నవ్వుకుంది. తన స్వయంవరం రోజును గుర్తు తెచ్చుకుంది : ''అర్జునుడు తనను గెలుచుకొన్న తరువాత ఒకరి తరువాత ఒకరిని ఐదుగురిని తాను వివాహమాడిందే, ఆ రోజున తనగుండెల్లో బాధ అతడికి తలంపుకు రాలేదా? తాను మనస్సు చంపుకోవలసి వచ్చిందే. కనీసం తాను అందరిని పైకి సమంగానే చూసిందే. అర్జునుణ్ణి తాను అందరిలోకీ ఎక్కువగా అభిమానిస్తే అందులో విశేషం ఏముంది? ధర్మరాజు యింత అధర్మంగా ఆలోచించాడా?

ఆమె ఆలోచనలు ఒక్కసారి ఆగిపోయాయి : ''అసలు ప్రేమించడం అంటే ఏమిటి? ఉలూపి, చిత్రాంగద, సుభద్రలు అర్జునుణ్ణి ప్రేమించారు. కాని అర్జునుడు కృష్ణుణ్ణి ప్రేమించాడు. అర్జునుని హృదయాన్ని ఏ స్త్రీ గెలువలేదు. ప్రేమ ఎప్పుడూ ఇలాగే ఉంటుందా? ఏక పక్షమేనా?'' మెరుపులాగ అంతకు ముందు ఎన్నడూ చూడని గుర్తింపును పొందింది జ్ఞానోదయమైంది. ''భీముడు తనను ఎంతగా ప్రేమించాడు'' జూదమాడుతున్న ధర్మరాజు చేతులను కాల్చ ప్రయత్నించాడు. కాని అర్జునుడు ఆపాడు. తాను అలిసినప్పుడు భీముడు ఓదార్చాడు. ద్రౌపది జుట్టు జడపాయలు దీస్తూ, దుశ్శాసనుని రుధిరాన్ని కళ్ళ చూస్తానన్నాడు. అర్జునుడు కీచకుణ్ణి చంపగలిగినా, ఆ పని చేసింది భీముడు మాత్రమే. ఆమెకు ఎన్నో విషయాలు జ్ఞాపకానికి వచ్చాయి. భీముడు ఆశాపరుడు, కోప స్వభావి, మొరటువాడు. ఇవన్నీ భూ పుత్రుల లక్షణాలు. తనకు అవే లక్షణాలున్నాయి తాను భూమిపుత్రి, అతడు భూమి పుత్రుడు.

ఏదో ఈడ్చుకు పోతున్న శబ్దం. ఆమె శరీరం భయంతో కంపించిపోయింది కన్నులు గట్టిగా మూసుకొంది హఠాత్తుగా ఆమె కన్నుల మీద ఏదో నీడ పడింది. సూర్యునికి తనకు మధ్య ఏదో తెరపడినట్లైంది. ''ద్రౌపదీ!'' అనే పిలుపు వినపడింది. అది భీముని కంఠం శరీరాన్ని ఈడ్చుకుంటూ వచ్చింది భీముడే. ఆ పది పదిహేనడుగుల దూరం దాటి వచ్చేటప్పుడు మధ్యలో అర్జున, నకుల, సహదేవులు చనిపోయి ఉండడం భీముడు చూశాడు. ద్రౌపది కూడ చనిపోయి ఉంటుందనుకొన్నాడు. ద్రౌపది భయపడి ఏమీ అర్థం కాక చూసింది ద్రౌపది ప్రాణంతో ఉండడం చూసి భీముడు సంతోషంతో ''నేను నీ కోసం ఏమైనా చేస్తాను'' అన్నాడు ఆ మాటలు గూడ అతి కష్టం మీద ఆయాసంతో వచ్చాయి.

ఈ మాటలనే భీముడు లోగడ ఎన్నోసార్లు చెప్పాడు. కాని ఈ పరిస్థితుల్లో అవి అర్థ రహితాలు, అసందర్భాలు. ద్రౌపది చిరునవ్వు నవ్వింది. భీముని ముఖాన్ని దగ్గరకు లాక్కొని అంతిమ నిశ్వాసతో ఇలా అంది : ''మన తరవాతి జన్మలో నీవు పెద్దవాడివిగా పుట్టు. నీ నీడన మనం అందరం సుఖంగా ఉందాం.''

# నమ్మశక్యం కాని నిజాలు

- డాక్టర్ వేమూరి వెంకటేశ్వరరావు
Department of applied sciences, USA

★ మన శరీరంలో దరిదాపుగా పది ట్రిలియను పైబడి జీవకణాలు ఉన్నాయి అంటే పది లక్షల కోట్లు.

★ మన తెలివి తేటలకీ, మన మెదడులో ఉన్న జీవకణాలకీ మధ్య చిన్న బాదరాయణ సంబంధం ఉంది. ఒక చిన్న కీటకం మెదడులో 25 కణాలు. చీమ బుర్రలో 250, తేనెటీగ మస్తిష్కంలో 1000 జీవకణాలుంటే మన మెదడులో దాదాపు 10 బిలియన్లు, అంటే 10,000,000,000 జీవకణా లున్నాయి. ఈ జీవకణాలను నూరానులు అని అంటారు.

★ మెదడులో ఉన్న కణాల సంఖ్య పెరిగినకొద్దీ, ఆ జీవికి తెలివితేటలు ఎక్కువ ఉండే ఆస్కారం ఉంది. కానీ, మన మెదడులో ఉన్న కణాలు రోజుకి 50,000 చొప్పున చచ్చిపోతాయి. అంటే 70 ఏళ్ల జీవితంలో బిలియను కణాల ప్రాప్తికి తగ్గిపోతాయి. కనుక వయస్సు పెరుగుతున్న కొద్దీ లెక్క ప్రకారం తెలివి తేటలు తగ్గాలి. అయినా పెద్దవాళ్లని తెలివయిన వాళ్లలా పరిగణిస్తాం. అవునా? ఎందుకో తెలుసా? పుట్టినప్పటి స్థితితో పోల్చి చూస్తే మెదడు సైజు పదో వంతు తగ్గినా, 70 ఏళ్ల అనుభవం ఎక్కడికి పోతుంది? అందుకని పెద్దవాళ్లని గౌరవిస్తాం. తెలివయిన వాళ్లని కాదు, అనుభవజ్ఞులని. తెలిసిందా? పెద్దవాణ్ణి చెబుతున్నాను, నా మాట వినండి

★ మన జ్ఞానేంద్రియాలు సేకరించి అందించే వార్తలలో మన మెదడు ఒక శాతం మాత్రమే జీర్ణించుకుంటుంది మిగిలినవి మెదడులోకి ఇంక కుండా గోడ మీద నీళ్లు పోసినట్లు జారిపోతాయి.

★ మన తల మీద దరిదాపుగా 120,000 వెంట్రుకలు ఉంటాయి. పెద్ద పెద్ద సంఖ్యలని చెప్పవలసి వచ్చినపుడు, ''నా నెత్తిమీద వెంట్రుకలు ఎన్ని ఉన్నాయో, అన్ని'' అని అంటాం. కాని నిజానికి మన నెత్తి మీద ఎన్నో వెంట్రుకలు లేనే లేవు

★ మన శరీరం మీద ఉన్న చర్మాన్నంతటినీ ఒలిచేసి తూకం వెయ్యగలిగితే, మూడు కిలోలు తూగుతుందట. ఇందులో ఏడాదికి ఒక కిలో చొప్పున రాలిపోతూ ఉంటే, మళ్లా కొత్త చర్మం పుట్టుకొస్తూ ఉంటుంది

★ మన పొట్ట పొడవు నిజంగా జానెడే. అంటే పాతిక సెంటీ మీటర్లు ఈ పదంగుళాల పొడు పొట్టని నింపుకుందుకి పడరాని పాట్లు పడుతున్నాం.

★ మన పొట్టలో జీర్ణక్రియకి ఉపయోగపడే జఠర రసాలలో ఉదూరికామ్లం ఒకటి. దీనిని గొట్టంతో బయటికి జాగ్రత్తగా తోడి కర్ర మీద వేస్తే, ఆ కర్ర కాలిపోతుంది. అందుకోసమే దీనిని జఠరాగ్ని అని అన్నారేమో.

★ మన అదృష్టం బాగుండి మన చెవులకి అన్ని శబ్దాలూ వినిపించవు. లేకపోతే గాలిలో తేలియాడే అణువులు ఒకదానికొకటి కొట్టుకున్నప్పుడల్లా, ఆ చప్పుడు వినిపించి ఉంటే మనకి పిచ్చెక్కి పోయేది.

★ నొప్పి మూడు రకాలు. పగిలిపోతూన్నట్లు, సూదులతో పొడిచినట్లు, మండుతూన్నట్లు ఉండడం.

★ శరీరంలోని కండరాలన్నిటిలోకి గుండె కండరం చాల దిట్టమయినది విశ్రాంతి లేకుండా నూరేండ్లు నిండా పని చేస్తుంది. మనకి డెబ్బయి ఏండ్లు నిండే సరికి మన గుండె 5 బిలియను (500 కోట్లు) సార్లు కొట్టుకుంటుంది

★ మన రక్తంలోని ఎర్ర కణాలు నాలుగు నెలలపాటు బతుకుతాయి. ఈ నాలుగు నెలల్లో అవి 1500 కిలోమీటర్ల దూరం ప్రయాణం చేస్తాయి.

★ మనం ఒక జీవితకాలంలో 40 టన్నుల ఆహారం తింటాం. 5,00,000 ఘనపు మీటర్ల గాలి పీలుస్తాం నోటిలో 10,000 గేలన్ల లాలాజలం ఊరుతుంది.

## ఖనిజాలు, ఖనిజ లవణాలు

మన శరీరం బరువు సగటున నూరు కిలోలు అనుకుందాం. అందులో తొంభయి ఆరుకిలోల ప్రాప్తికి ఉదజని (హైడ్రోజన్), ఆమ్లజని (ఆక్సిజన్), నత్రజని (నైట్రోజన్), కర్బనం (కార్బన్), అనే నాలుగు మూలకాలే తూగుతాయి. మిగిలిన నాలుగు కిలోల మేరకే తూగే మూలకాలు అన్నిటినీ గుత్తగుచ్చి ఖనిజాలు (మినరల్స్) అని కాని, ఖనిజ లవణాలు (మినరల్‌సాల్ట్స్) అని కాని పిలుస్తారు.

మన ఆరోగ్యానికి విటమినులు ఎంత ముఖ్యమో, ఖనిజాలు కూడ అంతే ముఖ్యం. నిజానికి విటమినులు, అజములు (ఎంజైములు), హోర్మోనులు, మొదలయిన రసాయనాల తయారీకి ఈ ఖనిజాలు అత్యవసరం. ఈ దృక్కోణం నుండి చూస్తే ఖనిజాలు విటమినుల కంటె ముఖ్యమేమోనని అనిపిస్తుంది. ఎముకలు, దంతాలు సరిగ్గా తయారవడానికి, గుండె సరిగా కొట్టు కోవడానికి, తిన్న తిండి సరిగ్గా అరగడానికీ ఈ ఖనిజాల తోడు కావాలి. వీటి మోతాదు ఎక్కువయినా, తక్కువయినా సరే గుండె జబ్బు, మధుమూత్ర వ్యాధి, రక్తపు పోటు, కేన్సరు వంటి జబ్బులు వచ్చే అవకాశం ఉంది.

మన శరీరానికి కావలసిన ఖనిజ లవణాలు అన్నీ భూమిలో దొరుకుతాయి. భూమిలోంచి మొక్కలలోకి, అక్కడ నుండి, జంతువుల శరీరాల్లోకి, మన శరీరంలోకి చేరుతాయి. పైన చెప్పిన నాలుగూ కాకుండా, ప్రకృతిలో ఇంకా వంద మూలకాలు (ఎలిమెంటులు) ఉన్నాయి వీటిల్లో మన శరీరానికి అతి ముఖ్యంగా కావలసినవి ఇరవై రెండు ఈ ఇరవై రెండింటిలో ఏడు పెద్ద పెద్ద మోతాదుల్లోనే ఉంటాయి. వాటి పేర్లు ఇవి : ఖటికం(కేల్సియం), హరితం (క్లోరీన్), మెగ్నీసియం, భాస్వరం(ఫోస్ఫరస్), పొటాసియం, సోడియం, గంధకం(సల్ఫర్), పెద్ద మోతాదంటే దరిదాపు అరకిలో వరకు అవకాశం ఉందని గ్రహించాలి మిగిలిన పదిహేను మూలకాలు అతి స్వల్పమైన మోతాదులో మాత్రమే మన శరీరంలో ఉంటాయి. ఎంత తక్కువంటే, ఇవన్నీ కలిపిరోజుకి రెండు వందల మిల్లీ గ్రాములు చాలు. ఈ పదిహేనూ మన ఆరోగ్య రక్షణకి అవసరమని తెలిసింది కాని ఇవి మన ఆరోగ్యాన్ని ఎలా కాపాడుతున్నాయో ఇంకా కూలంకషంగా అర్థం కాలేదు. బాగా అర్థం అయినవి క్రోమియం, రాగి(కాపర్), ప్లవనం (ఫోరీన్), అయొడిన్, ఇనుము (అయిరన్), మంగనం (మేంగనీస్), మోలిబ్డినం, సోమం (సెలినియం), యశదం (జింక్), మిగిలిన తొమ్మిదింటి గురించి ఇంకా బాగా అర్థం కాలేదు. ఏది ఏమైతేనేమి, ఈ ఇరవయి రెండు మూలకాలూ శరీరానికి అత్యవసరం.

ఇవే కాకుండా మన శరీరానికి హాని చేసే మూలకాలు కూడా మనకి అప్పుడప్పుడు తారస పడుతూ ఉంటాయి. వీటిల్లో ముఖ్యమయినవి నాలుగు : సీసం(లెడ్), బంగారం (గోల్డ్), పాదరసం (మెర్క్యురీ), కేడ్మియం. ఈ నాలుగూ, మానవుని దైనందిన కర్మకాండల ఫలితంగా ముందు వాతావరణంలో చేరి, అక్కడ నుండి మొక్కలలోకి, తదుపరి జంతువుల శరీరాలలోకి చేరి, ఆఖరున మన శరీరంలో తిష్ఠ వేసికొని, నెమ్మది నెమ్మదిగా మన శరీరాన్ని విష పూరితం చేస్తాయి.

ఇప్పుడు మన శరీరానికి పనికొచ్చే స్వల్ప మోతాదు ఖనిజాల సంగతి చూద్దాం. ఇనుము రక్తచందురం (హిమోగ్లోబిన్) తయారీకి అత్యవసరం ఈ రక్త చందురమే ఆమ్లజనిని ఊపిరి తిత్తుల దగ్గర గ్రహించి, శరీరం అంతటకీ సరఫరా చేస్తుంది. ఇనుము సరిపడ్డంతగా లేకపోతే రక్తపు విరుగుడు (ఎనీమియా) అనే రుగ్మత వస్తుంది. నీరసం, ఆయాసం ఈ జబ్బు లక్షణాలు. మాంసం, గుడ్లు, ముదురాకుపచ్చగా ఉన్న ఆకుకూరలు, బటానీలు, గింజలు, కిసుమీసు పళ్లు, మొదలయిన పదార్థాలలో ఇనుము విస్తారంగా దొరుకుతుంది. ఇనప పెనం మీద వేసిన అట్లు తిన్నా, ఇనప గిన్నెలలో వండిన వంట తిన్నా కూడ ఇనుము శరీరానికి సరఫరా అవుతుంది.

ఇక అయొడిన్ సంగతి చూద్దాం. మన శరీరంలో (థయిరాయిడ్) అనే వినాళ గ్రంథి పని చెయ్యడానికి అయొడీన్ అత్యవసరం. ఈ గ్రంథి కుత్తిక్కాయ (ఏడమ్స్ ఏపిల్) కి రెండు పక్కలా ఉంటుంది. తినే ఆహారంలో అయొడీన్ సరిపడా లేకపోతే, ఈ గ్రంథి పెరిగి పెద్దదవుతుంది. ఈ వ్యాధిని గళగండం (గోయిటర్) అంటారు. సముద్రపు ఉప్పులో అయొడీన్ విరివిగా ఉంటుంది కనుక సముద్రపు ఉప్పు వాడే వారికి ఈ వ్యాధి రాదు

యశదాన్ని ఇంద్రియ ఖనిజం అనొచ్చు. యశదం మోతాదు తక్కువయితే పెరుగుదల సరిగ్గా కొనసాగదు. కనుక యుక్తవయస్సులోకి వచ్చే పిల్లల ఎదుగుదలకి ఇది చాలా అవసరం. అంతేకాదు. ఇది తక్కువ అయితే రుచి, వాసన సరిగ్గా తెలియవు. దెబ్బలని మానిపించేటప్పుడు కూడా యశదం ముఖ్యమయిన పాత్రే వహిస్తుంది.

రాగి ఆరోగ్యానికి మంచిదని మన పూర్వీకులకు కూడా తెలుసు. శరీరంలో రాగి మోతాదు తక్కువయితే ఇనుము ఒంటపట్టదు. అందుకనే కాబోలు, పడుక్కునే ముందు రాగి పంచపాత్రలో నీళ్లు పోసికొని, తెల్లారి లేవగానే తాగేవారు మా భగవాన్లు తాతగారు.

సెమినియం జీవకణాల ఆరోగ్యానికి మంచిది మన జీవకణాలను నాశనం చేయగలిగే శక్తి ఉన్న శాల్తీలలో స్వతంత్ర రాసులు (ఫ్రీ రేడికల్స్) అనేవి ఒకటి. వీటి వీర విహారాన్ని అరికట్టి, జీవకణాల ఆరోగ్యాన్ని కాపాడడానికి సెలినియం బాగా తోడ్పడుతుంది. మన పర్యావరణం కల్మషపూరితం అవుతూన్న ఈ రోజులలో స్వతంత్ర రాసులు విచ్చలవిడిగా చేసే వీరవిహారాన్ని అరికట్టడం చాలా ముఖ్యం

పళ్లు పుచ్చిపోకుండా ఉండడానికీ, ఎముకల గట్టితనానికీ ప్లవన లవణాలు అత్యవసరం. మన పళ్ల మీద ప్లవనం ప్రభావం అర్థం అయిన తర్వాత, అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలో పుచ్చు పళ్ల రోగాన్ని అరికట్ట గలిగారు. ఎముకలు ఎదగడానికి మంగనం కూడా కావాలి.

క్రోమియమ్ తక్కువయితే ఇన్సులిన్ తయారీకి ఆటంకం వస్తుంది. ఇన్సులిన్ తగినంతగా రక్తంలో లేకపోతే మధు మూత్ర వ్యాధి వస్తుంది. జీవకణాల జీవన ప్రక్రియలకు (మెటబాలిక్ ఏక్టివిటీస్‌కి) మోలిబ్డినం ముఖ్యంగా కావాలి.

తగినంత మోతాదులో ఈ లవణాలను శరీరానికి ఎలా సరఫరా చెయ్యడం? నాలుగు రుచులతో సక్రమమైన ఆహారం తింటూన్నంత సేపూ మనకి కావలసిన విటమినులు, లవణాల గురించి బెంగ అక్కరలేదు. పప్పులు, దినుసులు, పండ్లు, పిక్కలు, కాయగూరలు, ఆకు కూరలు, పాడి వస్తువులు తింటూన్నంత సేపూ, చేపలూ, మాంసం అంతగా తినకపోయినా ఫరవాలేదు. కాని వైద్యుడి పర్యవేక్షణ లేకుండా సొంత వైద్యం చేసికోవడం మాత్రం మంచిది కాదు.

Buddhism and psychoanalysis teach us that the very ways in which we seek happiness actually block us from finding it. Our first mistake is in trying to wipe out all the sources of displeasure in our lives.

**By Mark Epstein, M.D.**

## DEFINITIONS

**Phobia :** A persistent fear of some object or situation. You know you shouldn't be afraid but you can't help it.

**Anxiety :** A pervasive feeling of fear or dread for no obvious reason.

**Panic :** The most severe emotion you can experience. You may think you are drying. Reassurance doen't help.

# ఆత్మ వుందా?

– పి. రాజగోపాల్‌నాయుడు (మాజీ ఎమ్. పి.)

లేదంటారు లోకాయతులు, చార్వాకులు, బౌద్ధులు, మార్క్సిస్టులు. పంచ భూతాలలో ఆకాశం భూతం కాదంటారు. ఊపిరిపోయిన తరువాత గుండె ఆగిపోతుంది. ఊపిరి తిత్తులు పనిచేయవు కళ్లు చూడవు. చెవులు వినవు నోరు పలకదు. ఇంద్రియాలన్నీ మొద్దుబారి పోతాయి ఒకటి రెండు రోజులలో శరీరం కుళ్లి కంపు కొడుతుంది కాలిస్తే మసియైపోతుంది. పూడిస్తే మట్టియై పోతుంది అంటారు

పుట్టిన ప్రతిదీ గిట్టడం ప్రకృతి ధర్మం. అంతేగాని గిట్టినవన్నీ పుట్టవంటారు విత్తనం మొలకెత్తుతుంది. పెద్దదౌతుంది. ఫలిస్తుంది. నాశనమౌతుంది. అలాగే భార్యా భర్తల సంభోగానంతరం భార్య గర్భం ధరిస్తుంది. బిడ్డని ప్రసవిస్తుంది. ఆ బిడ్డ పెరిగి పెద్దవాడవుతాడు. ముసలివాడవుతాడు. మరణిస్తాడు అంటారు. మరణించిన తరువాత మరలా ఏమీ లేదంటారు.

కొందరు జిజ్ఞాసువులకు ఈ వాదం అంత తృప్తిని కలిగించలేదు వారిలా ఆలోచించారు కొందరు మహా కవు లవుతున్నారు ఎందరో గాయకులవుతున్నారు మహా శిల్పు లవుతున్నారు వీరు మరణిస్తూనే వీరి విద్వత్తు, వీరి అనుభవాలు, వీరి మేధస్సు ఏమౌతుంది అంతరిస్తుందా? అయితే ఈ జన్మ కర్థమేముంది అని వాదింపసాగారు

ఈ విచారణ వేదాలలో ఏ మూలనున్నదోగానీ కనబడటం లేదు భగవద్గీతలో, ఉపనిషత్తులలో దీనికి ప్రత్యుత్తర మున్నది. దేహంలో ఆత్మ అనేది ఒకటి వున్నదని, ఊపిరి పోతూనే అది దేహం నుండి వేరు పడుతుందని, దేహానికి చావున్నదిగాని ఆత్మకు చావు లేదని అది చెబుతూ ఉన్నది లోకాయతు లచార్వాకుల వాదానికి విరుద్ధమైన వాదమిది.

మహా భారత యుద్ధం జరిగినప్పుడు అర్జునుడు ఇరు వాగులనున్న వారిని చూసి వీరి నందరినీ ఎలా సంహరించడం? పెద్దలైన భీష్మ ద్రోణాదులను, అందరి బంధువులను నేను సంహరించలేను అని అస్త్ర సన్యాసం చేస్తాడు అప్పుడు అర్జునుణ్ణి యుద్ధానురక్తుణ్ణి గావించడానికి, కార్యోన్ముఖుణ్ణి చేయడానికి శ్రీ కృష్ణుడు అర్జునునికి బోధ చేస్తాడు ఇది సాంఖ్య యోగంలో వున్నది. అందులో కృష్ణు డిలా అంటాడు

అన్త వ్యన్త ఇమే దేహా నిత్య స్యోక్తాశ్శరీరిణః – అనాశినో ప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత

ఈ యాత్మ ఎప్పుడూ వుంటుంది నాశనం లేనిది ప్రత్యక్ష ప్రమాణము మొదలగు ప్రమాణములతో తెలియ శక్యము కానిది ఈ శరీరమే నాశన మయ్యేది.

నజాయతే మ్రియలే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా స భూయః
అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే

ఈ యాత్మ పుట్టినది మరణము, బొందునది కాదు కొంత కాలముండి మరలా లేక పోవునది గాదు. కొంతకాలము లేక మరల వుండునదియు కాదు. ఈ ఆత్మ పుట్టువు లేనిది. నాశము లేనిది సర్వ కాలముల యందును ఒక విధముగానే వుంటుంది

**వాసాంసి జీర్ణాని యధా విహాయ**
నవాని గృహ్ణాతి నరో పరాణి
**తధా శరీరాణి విహాయ జీర్ణా**
న్యన్యాని సంయాతి నవాని దేహీ

మానవుడు చినిగిపోయిన వస్త్రములను వదలి, కొత్త వస్త్రములు ధరించే విధంగా ఆత్మకూడ

రోగము, ముసలితనము మొదలగు వానిచేత శిథిలములగు దేహాలను వదిలి కొత్త దేహాలను పొందుచున్నది

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః

న చైనం క్లేదయం త్యాపోన శోషయతి మారుతః

ఈ యాత్మను శస్త్రాలు ఛేదింపలేవు అగ్ని కాల్చలేదు. నీరు తడపజాలదు వాయు దేవుడు దీనిని ఎండించి చంపలేడు

అవ్యక్తోయ మచిన్త్యోయ మ వి కార్యోయ ముచ్యతే

ఆత్మ ఇంద్రియములచేత తెలియజాలనిది మనస్సు చేత గూడ తెలియ జాలనిది దేహము నశించుట చేత ఆత్మ నశింపదు

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ

తస్మా దపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హసి

పుట్టిన వానికి చావును, చచ్చిన వానికి పుట్టుకయును గలుగుట నిశ్చయము. అవశ్యముగా జరుగు ఈ జనన మరణములను గూర్చి నీవు వ్యసన పడవద్దు

ఇందులో కృష్ణుడు దేహము నశించునట్లుగా ఆత్మ నశింపదని, అది అనాదియని, నిత్యమైనదని ఒక దేహము నుండి మరియొక దేహంలోకెళుతుంటుందని, పుట్టిన వారు గిట్టడం, గిట్టినవారు పుట్టడం సహజమని అంచాడు పునర్జన్మ ఉన్నదని ఖచ్చితంగా చెబుతాడు

ఇది లోకాయతుల చార్వాకుల వాదానికి విశ్వాసానికి పూర్తి విరుద్ధమైనది

గ్రీసులో సోక్రటీస్, పైథాగరస్, ప్లేటో అనేవారు ప్రముఖ తత్త్వవేత్తలు

సోక్రటీస్ ''శరీరంలో ఆత్మ అనేది ఒకటున్నది శరీరం శిథిలం అయినాగాని ఆత్మ శిథిలం కాదు పునర్జన్మ అనేది వున్నదని నేను విశ్వసిస్తున్నాను'' అన్నాడు ఆ తత్త్వ వేత్తకు విషమిచ్చే ముందు దినం అతడు ఆత్మను గూర్చి వివరంగా చర్చించాడు ''నా పూర్వ జీవితమును నేను జ్ఞప్తి చేసుకోగలను'' అన్నాడు ప్లేటో పునర్జన్మను పూర్తిగా సమర్థించాడు తత్వవేత్త జ్ఞానియైతేకైవాల్యన్ని పొందగలడు అటు కాకుండ అతడు వస్తు వాంఛలలో చిక్కుకొంటే మృగంగా జన్మించే పరిస్థితి ఏర్పడుతుంది దుర్మార్గులు, త్రాగుబోతులు గార్దభాలుగా జన్మిస్తారు హత్యాకారులు, హింసావాదులు తోడేళ్లుగా, డేగలుగా జన్మిస్తారు'' అని వ్రాశాడు. బహుశః వీరందరూ ఆత్మను గూర్చి పుర్జన్మను గూర్చి భారతదేశం నుండి గ్రహించారేమో!

యూదులలోగూడా పునర్జన్మను గూర్చిన విశ్వాసమున్నదని తెలుస్తున్నది వారి గ్రంథమైన జోహార్‌లో ''ఏనాడో ఒకనాడు ఆత్మ పరమాత్మలో లీనం కాకతప్పదు. అలా జరగాలంటే ప్రతి జన్మలోనూ వారు సమగ్రతను పొందడానికి ప్రయత్నించాలి అలా పొందలేక పోతే మరొక జన్మనెత్తాలి పరమాత్మలో లీనం అయ్యే వరకు జన్మలెత్తుచూనే వుండాలి'' అని వ్రాసివుంది

బైబిలులో గూడా పునర్జన్మకు సంబంధించి ఎన్నో వ్రాతలున్నవి దీనిని బట్టి క్రీస్తుకు, అతని శిష్యులకు పునర్జన్మను గూర్చి విశ్వాసమున్నదని తెలుస్తుంది. మేథ్యుసువార్తలో, పాతటెస్టుమెంట్‌లో చెప్పినట్లుగా ఇలియాస్ జన్మిస్తాడా అని శిష్యులడిగితే క్రీస్తువారలతో ''ఎందుకలా అనుకొంటారు ఇదివరకే జన్మించాడు కాని మీరు అతనిని తెలుసుకోలేకున్నారు'' అన్నాడు. హెరోడ్ చేత వధింపబడిన జానే ఇలియాస్ అని క్రీస్తు భావం అతడు మరలా జన్మిస్తాడు'' అన్నాడు

ఖురాన్ ఈవిధంగా చెబుతుంది ''నీవు చనిపోయావు కాని భగవంతుడు నిన్ను బ్రతికించాడు. మరలా నీవు మరణిస్తావు అయినా అతడు నిన్ను బ్రతికిస్తాడు. కట్టకడకు అతడు నిన్ను తనలోనే చేర్చుకొంటాడు '' ఇస్లాం మతంలో సూఫీలు పునర్జన్మను గట్టిగా విశ్వసిస్తారు వారిలో ప్రముఖులైన జలాలాడి - డన్‌రూమా ఇలా వ్రాశాడు·

''నేను మరణించాను. మరలా ఒక మొక్కగా మొలిచాను. మరలా మరణించి ఒక జంతువుగా జన్మించాను తరువాత మరణించి ఒక మానవుడుగా ఆవిర్భవించాను. అందువల్ల నేనెందుకు భయపడాలి? మరణించడం వల్ల నాకేమి నష్టం కలుగుతుంది.''? జస్టీనియన్ అనే బై జాంటైన్ సార్వభౌముడు రోమన్ కేథలిక్ చర్చి వ్రాతలనుండి ఆత్మను గూర్చిన విషయములన్నిటినీ బహిష్కరింప జేశాడు చర్చికి సంబంధించిన ఎన్నో గ్రంథాలు నాశనం చేయబడినవి. అయినప్పటికీ జిజ్ఞాసువులైన పండితులు, మునులు ఎన్నో బాధలను భరించి పునర్జన్మకు సంబంధించిన సిద్ధాంతాన్ని పశ్చిమ దేశాలలో జీవించి ఉండేలాగా చేశారు.

తరువాత యాగార్డోనో బ్రూనో అనే ఇటలీ తత్వవేత్త పునర్జన్మను గూర్చి ప్రచారం గావించాడు. అందువల్ల అతడు శిక్షించబడి కాల్చివేయ బడ్డాడు ఆ తత్వవేత్త తనమీద తెచ్చిన ఆరోపణకు సమాధానం చెప్పాడు. ''అది ఒక శరీరంలోగాని మరొక శరీరంలోగాని వుండవచ్చు ఒక శరీరము నుండి మరొక శరీరములోకి వెడుతూ వుండవచ్చు'' అని గట్టిగా చెప్పాడు. ఆ సమయంలో పునర్జన్మను గూర్చి ఎవరూ నోరెత్తకపోయినా రహస్య సంస్థల ద్వారా అది ప్రచారం చేయబడి తన ఉనికిని నిలుపుకొన్నది

తరువాత చాలా మంది గొప్ప వారు జన్మించారు. వారిలో వాల్‌టేర్ ఒక్కడు. అతడు చర్చికి వ్యతిరేకంగా తిరుగుబాటు గావించాడు. అతడు పునర్జన్మ సిద్ధాంతాన్ని గట్టిగా సమర్థించాడు.

ప్రభుపాద స్వామి ''కమింగ్ బాక్'' అనే గ్రంథంలో అమెరికాకు సంబంధించిన బెంజిమన్ ఫ్రాంక్లిన్ ''నేనిప్పుడు ఈ జగత్తులో వున్నాను. ఇక మీదట గూడా ఏదో ఒక రూపంలో ఈ జగత్తులోనే ఉంటాను'' అన్నాడని వ్రాశాడు.

అమెరికా అధ్యక్షుడు జాన్ ఆడమ్స్ హిందూ తత్వ శాస్త్రాలను చదివేవాడట అతడు మరొక అధ్యక్షుడు తామస్ జఫర్‌సన్‌కు పునర్జన్మను గూర్చి వ్రాశాడట.

నెపోలియన్ పూర్వ జన్మలో తాను చార్లెమాగ్నే అని తన సేనానులతో తరుచుగా చెప్పేవాడట.

ఎమర్సన్, విట్‌మన్, థోరే గూడ పునర్జన్మలో నమ్మకం కలిగిన వారేనట. ఎమర్సన్ అతని గ్రంధాలయములో ఉన్న కఠోపనిషత్తును తీసి ''ఆత్మకు పుట్టుకలేదు. చావు లేదు. శరీరం నశిస్తుంది. కాని ఆత్మ నశించదు'' అని చదివాడట. విట్‌మన్ తన పద్యంలో తనకు మరణం లేదని ఎన్నో వేల ఏండ్లు బ్రతికి ఉంటానని వ్రాశాడు. ఫ్రాన్స్ రచయిత అయిన ఓనోర్ బాల్‌జాన్ తన నవలలో పునర్జన్మను గూర్చి వ్రాశాడు. డేవిడ్ కాపర్ ఫీల్డ్, చార్లెస్ డిక్కెన్సు గూడా పునర్జన్మను గుర్తించారు ఆత్మకు నాశనం లేదని లేనితనాన్ని గూర్చి విశ్వసించారు రష్యాలో లియో టాల్‌స్టాయ్ ''మన మెన్నో జన్మలెత్తుతాము. దేవునిలో లీనమయ్యే వరకు జన్మలెత్తుతూనే వుంటాము'' అని వ్రాశాడు.

పునర్జన్మను గూర్చి మొట్టమొదట గ్రీకు తత్వవేత్త పైథాగరస్ చెప్పాడని, చాలా పేరు ప్రతిష్ఠలు గలిగిన పాల్‌గాగిల్ చెబుతూ ''శరీరం నశించినా, ఆత్మ నశించదు. అది మరలా మరొక శరీరాన్ని పొందుతుంది'' అని వ్రాశాడు.

అమెరికాలోని గొప్ప పారిశ్రామికవేత్తయైన హెన్రీ ఫోర్డ్ ఒక పత్రికకు చెబుతూ 'నా ఇరవై ఆరవ ఏటనే నేను పునర్జన్మ సిద్ధాంతాన్ని విశ్వసించాను' అన్నాడు అలాగే అమెరికా సేనానియైన జార్జ్ ఎమ్. పాట్టన్ ''నేను నా యుద్ధ నైపుణ్యాన్ని పురాతన యుద్ధ రంగాలలో సంపాదించుకొన్నాను'' అని పునర్జన్మను సమర్థించాడు.

ఐరిష్ నవలా రచయితయైన జేమ్సు జాయిస్, తన నవలలో ఉన్న ఒక వీరునితో ఇలా మాట్లాడిస్తాడు: ''మనం మరణించిన తరువాత మరొక శరీరంలో జీవిస్తామని అంతకు ముందు గూడ జీవించామని అంటాడు. మనం కొన్ని వేల ఏళ్ళుగా వున్నాము అని గూడా అంటాడు.'' జాన్ లండన్ గూడ తన

నవలలో పునర్జన్మను గూర్చి వ్రాశాడు. ''నన్ను గొంతు పిసికి చంపినంత మాత్రాన నేను చనిపోయాను అనుకొంటారు అది తప్పు, నేను చావను ఎన్నో వేల ఏండ్లు నేను పుడుతూ గిట్టుతూ ఉంటాను నోబెల్ బహుమతి పొందిన హెర్మన్‌హెస్ - తన సిద్ధార్థ అనే నవలలో ''నేను వేల మూర్తులను చూచాను కొన్ని వేల ఏండ్లలో అవేవి చావలేదు. తమ రూపాలను మాత్రమే మార్చుకొన్నవి'' అని వ్రాశాడు కార్ల్‌జంగ్ అనే మనశ్శాస్త్రవేత్తయూ శాశ్వతమైన ఆత్మను గూర్చి తెలియజేశాడు. గొప్ప మనశ్శాస్త్రవేత్తయైన ఎరిన్‌సన్ తానెన్ని ఏండ్లనుండో జీవించి వున్నానని ఇక మీదట గూడ కొన్ని వేలేండ్లు జీవిస్తానని వ్రాశాడు. తరచుగా ఆత్మ శాశ్వతత్వాన్ని గూర్చి పునర్జన్మను గూర్చి మాట్లాడుచుంటాడు

మహా పురుషులైన మహాత్మాగాంధీ గారికి ఆత్మలో పునర్జన్మలో సంపూర్ణ విశ్వాస మున్నది అందుకనే వారు ఒకప్పుడు ''నేడు మానవులు ద్వేష భావంతో ఒకరినొకరు నాశనం చేసుకొనడానికి ప్రయత్నిస్తుండవచ్చు. కానీ ఈ జన్మలో కాకపోయినా ఏదో ఒక జన్మలో మానవాళి ద్వేషాన్ని విడనాడి ప్రేమతో విరాజిల్లుతుందని నేను విశ్వసిస్తున్నాను'' అన్నారు

మహనీయుడైన గౌతమ బుద్ధుడు కూడా పునర్జన్మను గూర్చి ప్రస్తావించకపోయినా, జాతక కథలలో ముందు జన్మలో ఆయన ఎవరుగా ఉండేవారో చెప్పాడు. జాతక కథలే నిజమయితే ఆయనకు గూడ పునర్జన్మలో నమ్మకమున్నదనే అనుకోవలసి వస్తుంది.

ఈ నాడు పారా సైకాలజీ హెచ్చు ప్రాధాన్యతను సంతరించు కొంటున్నది. వారు ముందు జన్మలను గూర్చి చెప్పగల కొందరి విషయాలను గూర్చి చెబుతున్నారు. పూర్వ జన్మలో వారెచ్చట వుండినారు? వారెలా జీవించారు? వారి తల్లి దండ్రుల పేర్లేవి? అన్న విషయాలను గూర్చి వారు తెలుపుతున్నారని, వారినచ్చటికి తీసుకొని వెడితే వారుండిన ఇండ్లను, వారి తల్లిదండ్రులను, అన్నదమ్ములను, అక్క చెల్లెండ్రను చూపిస్తున్నారని వారంటున్నారు ఇది ఎంతవరకు నిజమో, వీటిలో ఎంత అతిశయోక్తి ఉన్నదో

ఏమైనా ఇవి పరిశోధించబడవలసిన అంశాలే.

శాశ్వతం అనేది కేవలం మన కోరిక మాత్రమే అందులో హేతుబద్ధత లేదని స్పానిష్ తత్త్వవేత్త ఉనామునొ తన ''ది ట్రాజిక్ సెన్స్ ఆఫ్ లైఫ్''లో రాశాడు

శాస్త్రీయ ఆధారాలతో శరీరం లేని ఆత్మ వుండడానికి వీల్లేదని స్పష్టపడినట్లు ఎం.ఎన్. రాయ్ తన సైన్స్ అండ్ ఫిలాసఫీలో స్పష్టపరిచాడు

ఆత్మ పేరిట మనిషి శాశ్వతత్వ భ్రమలో ఎలా బ్రతుకుతున్నాడు, వివిధ మతాలు మనిషి బలహీనతల ఆధారంగా ఎలా వంచిస్తున్నాయి అనే పరిశీలన కార్లిస్ లామెంట్ క్షుణ్ణంగా చేశాడు అతడు తన ది ఇల్యూజన్ ఆఫ్ ఇమ్మోర్టాలిటీ అనే గ్రంథంలో యీ సమస్యను అన్ని కోణాలనుండి చర్చించాడు. పుట్టుక మనం కోరలేదు. మరణం కూడా మనం అభిలషించడం లేదు ఈ రెండింటి మధ్య మనం బ్రతుకుతున్నాం. మన జ్ఞానంవలన ఆత్మ అనేది మన సృష్టి అని, శాశ్వతత్వం మన భ్రాంతి అని గ్రహించగలగాలి అప్పుడు బ్రతుకును అనుభవించి, అర్థవంతంగా, విలువలతో మనగలుగుతాం.

## పరిశీలన :

The illusion of IMMORTALITY by Corliss Lamont 1990
(Half Moon foundation 370 Lexington Ave, NY 10017 USA).

ఇక పేరా సైకాలజి పేరిట లోకాన్ని కొన్ని దశాబ్దాలు మోసం చేసిన శాఖను అమెరికాలోని డ్యూక్ యూనివర్సిటీ మూసేసింది ఇందుకు ఆద్యులైన జె బి రైన్, ఆయన భార్య లూయిసారైన్ పుస్తకాలు రాసి, తమను పరిశోధకులు మోసగించారని వాపోయారు. (సంథింగ్ హిడెన్ 1983 చూడండి) ప్రపంచ వ్యాప్తంగా అతీంద్రియ శక్తి , ఆత్మశక్తి ఎక్కడా శాస్త్రీయ పరిశోధనకు నిలబడలేదు.

హేతువాది

# ఎం.ఎన్. రాయ్ ఇలా చేశాడా!

- డాక్టర్ ఎన్. ఇన్నయ్య

(ఆంస్టర్ డాంలోని ''అంతర్జాతీయ సాంఘిక చరిత్ర'' ఆర్కాయిస్‌లో నుండి తెప్పించిన పత్రాల ఆధారంగా తొలత వెల్లడిస్తున్న గాధ)

ఎం ఎన్ రాయ్ (1887-1955) జీవితంలో ఒక ఘట్టం ఇన్నేళ్ళుగా మర్మంగా వున్నది ఆయన తొలి భార్య ఎవిలిన్ 9 ఏళ్ళ కాపురం తరువాత హఠాత్తుగా విడిపోవడం ఎందుకో తెలియలేదు ఎవిలిన్ ట్రెంట్ (1892-1970) శాంతిదేవి అనే పేరిట కమ్యూనిస్టు అంతర్జాతీయ ఉద్యమంలో పనిచేసి, రాసింది ఆ కాలంలో తన జీవిత విశేషాలు గ్రంధస్తం చేసిన మానవేంద్రనాధ్ రాయ్ (తొలిపేరు నరేంద్రనాధ్ భట్టాచార్య) ఎవిలిన్ ప్రస్తావనే తీసుకురాలేదు విడిపోయిన తరువాత ఉభయులూ పరస్పరం మౌనం దాల్చాలని ఏదైనా అంగీకారానికి వచ్చారేమో అనుకున్నాం శిబ్‌నారాయణ్‌రే, వి బి.కర్నిక్, హెయిత్ కాక్స్ మొదలైన వారి పరిశోధనలలో కూడా ఎవిలిన్ విడిపోవడంపట్ల వివరణ లేదు

ఇప్పుడు లభించిన పత్రాలవలన ఎవిలిన్ కొన్ని విషయాలు వెల్లడించినట్లు ఆధారాలు తెలిశాయి రాయ్ దంపతులకు సన్నిహిత మిత్రుడు, ఇండోనేషియాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత, రెండో ప్రపంచ యుద్ధకాలంలో నాజీలచే హతమార్చబడిన స్నేవ్‌లైట్ పత్రాలలో ఎవిలిన్, రాయ్ ఉత్తరాలు వున్నాయి స్నేవ్‌లైట్ డచ్ వాసి అతని పత్రాలు నేడు ఆంస్టర్‌డాంలోని అంతర్జాతీయ సాంఘిక చరిత్ర సంస్థలో భద్రపరిచారు వాటి ఆధారంగా కొన్ని సంగతులు తెలుస్తున్నాయి

1917లో అమెరికాలోని న్యూయార్క్‌లో పెళ్ళాడిన ఎం ఎన్ రాయ్, ఎవిలిన్‌లు 9 సంవత్సరాలు కలిసిమెలసి వున్నారు మెక్సికో, రష్యా, యూరప్ దేశాలలో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో కృషి సాగించారు లెనిన్, స్టాలిన్, ట్రాటస్కీ, బరోడిన్‌లతో పనిచేశారు. భారత కమ్యూనిస్టు పార్టీని 1920 అక్టోబరులోనే తాష్కెంట్‌లో స్థాపించి, పెంచి పోషించారు. పత్రికలు నడిపారు భారత కమ్యూనిస్టులకు డబ్బు, సలహాలు, పత్రికలు, సాహిత్యం పంపారు.

కనుక ఎవిలిన్ - రాయ్ దాంపత్యం ప్రాధాన్యతను సంతరించుకున్నది

ఎవిలిన్ 1925 జులై 30న అమెరికా వెళ్ళిపోయింది ఆంస్టర్‌డాంలో జరిగిన కమ్యూనిస్టు వలస రాజ్యాల సమావేశంలో పాల్గొన్న అనంతరం ఆమె హఠాత్తుగా స్వదేశం వెళ్ళింది అంతకుముందు స్విట్జర్లండ్‌లో రాయ్ దంపతులు ''రెండవ ప్రేమయాత్ర'' వంటిది అనుభవించారు అక్కడే ఎవిలిన్‌ను వెళ్ళిపొమ్మని రాయ్, పిడుగువంటి ఉత్తరవులు యిచ్చాడు ఎందుకో చెప్పమని ఎవిలిన్ అడిగింది ఉంటానని బ్రతిమాలింది రాయ్ తన నిర్ణయం మార్చుకోలేదు కారణాలు ఏవీ చెప్పలేదు

ఎవిలిన్ తన వ్యక్తిత్వం చంపుకోకుండా వుండదలచినప్పుడు, రాయ్ అలాంటి నిర్ణయానికి వచ్చినట్లు అభిప్రాయపడింది అనేక సందర్భాలలో ఘర్షణలు వచ్చినా, తాను వ్యక్తిత్వం అణచుకొని, భార్యగా అణకువతో వున్నందున 9 ఏళ్ళు వుండగలిగానని, సింహావలోకనంలో ఎవిలిన్ తెలిపింది. 1921లోనే రాయ్ అలా ప్రవర్తించినప్పటికీ, తనపట్ల అలాంటి అభిప్రాయం వెల్లడించి వుంటే, అప్పుడే వెళ్ళిపోయే దానినని పేర్కొన్నది రాయ్‌తో కేవలం భార్యగానే గాక, అతని ఉద్యమ కృషిలో భాగం పంచుకున్న ఎవిలిన్‌కు, విడిపోవాలనే రాయ్ నిర్ణయం ఆమెకు షాక్ నిచ్చింది

రాయ్ తనను ఒక విలాస వస్తువుగా వాడుకున్నట్లు వెనక్కు తిరిగి చూచుకున్నప్పుడు, అవగాహనకు

వచ్చింది ఎవిలిన్ బహుభార్యాత్వ విధానంలో తాను ఒకత్తెగా వున్నాననే అభిప్రాయం కూడా ఎవిలిన్ వెల్లడించింది నిష్కర్షగా చర్చచేయకుండా, దాచిపెట్టి, గుంభనగా విషయాలు వుంచడం బహుశ తూర్పు దేశాల సంస్కృతి కావచ్చునని ఎవిలిన్ నిర్ధారణకు వచ్చింది ఏ ఘట్టంలోనైనా తాను పొరపాటు చేసినట్లు 9 సంవత్సరాలలో రాయ్ ఎన్నడూ చెప్పిపొడవ లేదు. అలాంటప్పుడు యీ హఠాత్తు నిర్ణయం ఎలా చేస్తాడని ఎవిలిన్ ఆశ్చర్యపోయింది

1925 ఆగష్టు నుండీ అమెరికాలో వున్న ఎవిలిన్ అనేక ఉత్తరాలు రాసినా రాయ్‌నుండి సమాధానం రాలేదు ఉభయులకూ కుటుంబ, ఉద్యమ మిత్రుడుగా వున్న స్నీవ్‌లైట్‌కు విషయాలు రాసింది. కారణాలు కనుక్కోమన్నది ఒకవేళ రాయ్ తిరిగి రమ్మన్నా, పూర్వంవలె వుండడం కుదరదని భావించింది అయినా రమ్మంటాడేమో కనుక్కోమని కోరింది. వెళ్ళిపొమ్మనడానికి కారణాలు కావాలని తరచి అడిగింది. భారతదేశంలో పనిచేయాలని, తూర్పుదేశాల ఉద్యమాలలో పాల్గొనాలని ఆశించిన ఎవిలిన్, మళ్ళీ కమ్యూనిస్టు పార్టీ కోరితేనో, రాయ్ పిలిస్తేనో రాగలననుకున్నది

మాతృదేశం అయిన అమెరికాలో అడుగు పెట్టిన ఎవిలిన్, నోరు విప్పినా, అక్కడ కమ్యూనిస్టు పార్టీలో పనిచేసినా దేశంనుండి పంపించేవారే. అప్పటికే 1926లో చికాగో జరిగిన అమెరికా కమ్యూనిస్టు పార్టీ సమావేశంలో పాల్గొన్నది. కాని మురా తగాదాలు, నీచంగా వదంతులు వ్యాపించడం, రాయ్‌ను వదిలేసి వచ్చిందని తనపై నీలాపనిందలు, గూఢచారి అని, డబ్బు కాజేసిందని, మరెన్నో నిందలు విని విసుగుచెంది వారందరికీ దూరంగా వుండాలని నిర్ణయించుకున్నది.

ఎట్టకేలకు తన ఉత్తరాలకు రాయ్ సమాధానం యిస్తూ, అమెరికాలోనే వుండిపొమ్మని, తన దగ్గరకు రానక్కరలేదని తెలియజేశాడు

క్రమేణా షాక్ నుండి తేరుకొని, జర్నలిస్ట్‌గా అమెరికాలో ఎవిలిన్ స్థిరపడింది 1930లో ఇండియా తిరిగి వచ్చిన రాయ్‌ను బ్రిటిష్ పోలీస్ అరెస్టు చేయగా ఎవిలిన్ ఖండిస్తూ వ్యాసం రాసింది

రాయ్ తన స్మృతులను రాడికల్ హ్యూమనిస్ట్‌లో ప్రతివారం రాస్తున్నప్పుడు తన పేరు ప్రస్తావిస్తాడేమోనని ఎదురు చూచింది డెహ్రాడూన్‌లో చివరిదశలో రెండవ భార్య ఎలెన్‌కు చెప్పి రాయించిన రాయ్ ఏకోశానా ఎవిలిన్ గురించి నిజం చెప్పలేదు

రాయ్ చనిపోయిన అనంతరం ఎలెన్ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఎవిలిన్‌తో సంబంధం పెట్టుకున్నది కొందరు స్వదేశీ విదేశీ రాజకీయ పరిశోధకుల్ని ప్రోత్సహించి ఎవిలిన్ దగ్గరకు పంపించింది రాయ్‌ను గురించి చెడుగా రాసిన వారిని ఎవిలిన్ ఖండించింది. రాబర్ట్ నార్త్ అనే రాజకీయ శాస్త్రజ్ఞుడికి రాయ్ గురించి అనేక విషయాలు ఎవిలిన్ చెప్పింది చివరి వరకూ రాయ్‌పట్ల ఎవిలిన్ ఉదాత్తంగా ప్రవర్తించింది. కమ్యూనిస్టుగా ఎం ఎన్ రాయ్ మాత్రం ఎవిలిన్‌పట్ల మానవ ధర్మంతో వ్యవహరించలేదు.

ఎవిలిన్ - రాయ్ మధ్య సయోధ్యకై స్నీవ్‌లైట్ ప్రయత్నించకపోలేదు ఎవిలిన్ అమెరికా వెళ్ళిన అనంతరం ఎం.ఎన్. రాయ్ స్నీవ్‌లైట్ యింట్లో కొన్నాళ్ళున్నాడు అప్పుడు ఎంత చెప్పి చూచినా, రాయ్ రాజీకి ఒప్పుకున్నట్లు లేదు ఈలోగా రాయ్‌ని తొందరపడి ఏమీ అనవద్దని, మళ్ళీ తూర్పుదేశాలలో ఉభయులూ కలిసే అవకాశం వుందనీ స్నీవ్‌లైట్ రాశాడు. బహుశ అప్పుడు విషయాలన్నీ రాయ్ విడమరచి, మనస్సు విప్పి చెప్పవచ్చునని కూడా ఎవిలిన్‌ను ఓదార్చాడు కాని అలాంటిదేమీ జరగలేదు ఎవిలిన్ యూరోప్ నుండి వెళ్ళిపోయిన సంవత్సరంన్నరకు గాని రాయ్ చైనా వెళ్ళలేదు. ఈలోగా ఆయనకు లూసేగీస్లర్ అనే స్విస్ కమ్యూనిస్టు యువతితో సన్నిహిత పరిచయం ఏర్పడింది. ఆమెను ఆంతరంగిక కార్యదర్శిగా చైనా తీసుకువెళ్ళాడు ఎవిలిన్ - రాయ్ 9 ఏళ్ళ దాంపత్యం అలా ముగిసింది

మధురవాణి మాటకచేరి

# కలకంఠి కంట కన్నీరొలకిన...

– సత్తెనపల్లి రామమోహన్ రావు

ఆడవాళ్ళ నెత్తిమీద చన్నీళ్ళ కుండ ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది - అనే నానుడి ఒకటి వుంది. ఆడవాళ్ళని అస్తమానం ఏడిపించే మగమహారాజులే యిటువంటి సూక్తులు సృష్టిస్తారని వేరే చెప్పనక్కరలేదు. ఆడవాళ్ళకి బాధ కలిగేటట్లు చేయటం - వాళ్ళు కన్నీరు పెట్టుకుంటే నీళ్ళ కుండకు చిల్లిపడిందంటూ ఎకసెక్కాలాడటం మొదటినుంచి మగవాళ్ళకు అలవాటై పోయింది తల్లికి తెలియకుండానే కన్న కూతుర్ని, పదేళ్ళు నిండని పసికందుని డెబ్బయి ఏళ్ళ మూడుకాళ్ళ ముసలాడికి యిచ్చి పెళ్ళి చేయటానికి ఒప్పందం కుదుర్చుకొని వస్తాడు అగ్నిహోత్రావధాన్లు. ఆ సంగతి విని కన్నతల్లి కాబట్టి, కడుపుతీపి కాబట్టి వెంకమ్మ లబోదిబోమంటూ ఏడుస్తుంది. ఆమె ఎంత ఏడ్చినా పట్టించుకోకుండా - తాంబూలాలిచ్చేశాను తన్నుకు చావండి - అంటాడు అగ్నిహోత్రావధాన్లు. ఇహ చేసేదిలేక తన కన్నీళ్ళు ఎవరినీ కరిగించవని తెలుసుకొని వెంకమ్మ నూతిలో పడతానని బెదిరిస్తుంది పడుపడు అన్న సవితే కాని పడ్డ నాసవితి లేదంటూ అప్పుడూ వేళకోళమే చేస్తాడు గిరీశం. వెంకమ్మకు కన్నీళ్ళు పెట్టుకోకుండా ఆ యింట్లో ఒక్క క్షణం గడవదు. ఆమె మొగుడు అగ్నిహోత్రావధాన్లు చేసే పనులు అంత లక్షణంగా వుంటాయి మరి...

అసలు మొదటినుంచీ అన్ని విషయాలలోను మగవాళ్ళదే పై చేయిగానే వుంది అందుకే కష్టాలు, కన్నీళ్ళు ఆడవారి పరమయ్యాయి ఆఖరికి సరస్వతీదేవి అంతటి ఆవిడకు కూడా కన్నీళ్ళు పెట్టుకోకుండా తప్పలేదు. తనని ఏ మనజేశ్వరాధములకో అంకితమిస్తానని అనుమానం కలిగినప్పుడు ఆ ---- రాణి కూడా - ''కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ -'' ఏడ్చేస్తుంది. ''నిను నాకటిం కొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ-'' అంటూ భక్తపోతన హామీ యిస్తేకాని ఆవిడ కన్నీరు ఆగదు అంతటి దేవతకే కన్నీళ్ళు తప్పనప్పుడు యిహ మాలాంటి మానవ మాత్రుల సంగతి చెప్పాలా?..

ఏడ్చే మొగవాణ్ణి నవ్వే ఆడదాన్నీ నమ్మకూడదని మరో సామెత వుంది. ఈ సామెతలో ద్వితీయార్థం సంగతి ఎలావున్నా ప్రథమార్థం మాత్రం కొంత ఆలోచించ తగ్గదే. ఏడ్చే మగవాణ్ణి నమ్మేమాట ఎలా వున్నా అసలు చూడబుద్దే కాదు. అందరూ సమానమే కదా అని చెప్పి మగవాళ్ళు కూడా ఆడవారికి మల్లే ప్రతి చిన్న విషయానికీ ఏడుస్తూ చొక్కా కాలరుతో కళ్ళు తుడుచుకుంటూ, ముక్కు చీదుకుంటూ వుంటే చూడటానికి కంపరంగా వుండదూ? - పాశ్చాత్యదేశాలలోని ఆడవాళ్ళు మనదేశంలోని ఆడంగులకు మల్లే చీటికి మాటికీ కన్నీళ్ళు పెట్టుకోరట. ఆమాట నాకు గిరీశంగారే ఒకసారి చెప్పాడు. ''ఎందుకు ఏడవరో తెలుసా? - వాళ్ళు గౌన్లు స్కర్ట్లు వేసుకుంటారు. మనవాళ్ళకి మల్లే కళ్ళు తుడుచుకోటానికి చీర చెంగులు వుండవు కదా వాళ్ళకి అందుకే అక్కడి ఆడవారు చీటికీ మాటికి ఏడవరు-'' అని మరో పరమ రహస్యాన్ని కూడా చెప్పాడు గిరీశం. ఈ మాటల్లో ఎంత నిజముందో కాని మొత్తంమీద మనదేశంలోని ఆడంగులే ఏడవటంలో సిద్ధహస్తులని చెప్పుకోవచ్చు.

అనేక కారణాలవల్ల మొదటినుంచీ మనదేశంలో ఆడవాళ్ళకి దుఃఖమే దగ్గర చుట్టమై కూర్చుంది. ''అశోక వనమున సీత శోకించె వియోగము చేత -'' అన్నట్లు పరమసాధ్వి సీతకు కూడా బ్రతుకులో చాలా భాగం దుఃఖంతోనే గడిచిపోయింది. రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు - ''ఓహో నా మొరన్ యెవ్వరున్ వినని యట్లున్నారొకండైన మీ బాహుదర్ప మెలర్ప దాక దగరే, బందీ విమోక్షంబు మీకావ్య పుణ్యము కాదే యాలింపరే-'' అంటూ అందర్నీ ఎలుగెత్తి వేడుకున్నా ప్రయోజనం కనపడదు. ''యోరీ వైదేహిందెత్తువా యంచు నడ్డుపడరే దిక్పాలురీ ద్రోహికిన్-'' అంటూ దిక్పాలకుల్ని కూడా ప్రార్థిస్తుంది. కాని ఆ వేదన అరణ్య రోదనే అయి ఎవరూ ఆమెను రక్షించేందుకు ముందుకు రారు. దాంతో పన్నెండేళ్ళు లంకలో దుఃఖిస్తూనే గడపాల్సి వస్తుంది సీతకు. వాల్మీకి రామాయణంలో కాని మొల్ల రామాయణంలో

కాని రంగనాథ రామాయణంలో కాని - ఏ రామాయణంలో నయినా సీతాశోక ఘట్టాలే కరుణరసం వెల్లువలై పారిన పతాక ఘట్టాలయి కూర్చున్నాయి. వాటినే మళ్ళీ మళ్ళీ చదువుకుంటారు భక్తులు కాని ఆ సీతమ్మ కన్నీళ్ళ వెనక దాగివున్న నిస్సహాయతను, హృదయావేదనను, పరాభవాగ్నిని ఎంతమంది అర్థం చేసుకున్నారంటారు? - ఎవరిదాకానో ఎందుకు ఆ పరంధాముడికే పెళ్ళాం కన్నీళ్ళు, కష్టాలు అంతగా పట్టలేదు. లేకపోతే అన్నేళ్ళ వియోగం తర్వాత, నిత్య కన్నీటి అభిషేకాల అనంతరం దగ్గరకొచ్చిన సతీమణిని అగ్నిలో దూకమంటాడా?. . పోనీ అని అందుకూ తట్టుకొని పునీత అయి వచ్చిన పావనిని వెనకటి దుఃఖపు తెరలు యింకా మరుపులోకి రాకుండానే మళ్ళీ అడవులలోకి పంపుతాడా? - ఆడవాళ్ళ ఆగని కన్నీటికీ, మగవాళ్ళ దౌర్జన్యాలకీ తరతరాలుగా నిలిచిపోయిన తిరుగులేని సాక్ష్యమే సీతమ్మ కథ

లేకపోతే. మగవారి గడుసుతనం కాకపోతే అన్నీ తెలిసికూడ - ''యేం వదినా కంటనీరు పెడుతున్నారూ?-'' అని గిరీశం బుచ్చెమ్మను అడుగుతాడూ?. ఒక పక్క తను వైధవ్యంతో బాధపడుతున్నది చాలక మరోపక్క పసిపిల్ల తన చెల్లెల్ని మరో ముసలాడికిచ్చి పెళ్ళి చేస్తున్నారంటే బుచ్చెమ్మకు ఏడుపురాదూ? ఆ సంగతి గిరీశానికి తెలియదా.. పైపెచ్చు ఆపెళ్ళి పనులన్నీ పూనుకొని తనే స్వయంగా చేస్తూ - యేం వదినా ఏడుస్తున్నారూ - అని అడిగాడంటే గిరీశం ఎంత గుండెలు తీసినబంటు అయి వుండాలి? ఆడవాళ్ళ దగ్గరకొచ్చేసరికి చాలామంది మగవాళ్ళు యిలాంటి గుండెలు తీసిన బంట్లే అయిపోతూ వుంటారు అదేం చిత్రమోకాని...

ఇలాంటివాటి సంగతి ఎలావున్నా కన్నీళ్ళనే ఆయుధంగా చేసుకొని తమ పంతాలు నెగ్గించుకున్న, పట్టుదలలు సాధించుకున్న ఆడంగులు కూడా లేకపోలేదు వీరు కన్నీళ్ళతోపాటు వగలును వయ్యారాన్ని వొలికించి - మగవాళ్ళని కరిగించి, మురిపించి తమ పంతాలు నెగ్గించుకుంటారు. కార్యాలు సాధించుకుంటారు. కొందరి కోమలాంగుల విషయంలో మనధ్మని పువ్వుల బాణాలకంటె వారి కన్నీటి శరాలే ఎక్కువ పదునైనవి అని చెప్పుకోవచ్చు. ఏడుపంటే నాకసహ్యం కాబట్టి కాని లేకపోతే ఒక్క కన్నీటి చుక్కతో రామప్పపంతుల్నీ, కరటక శాస్త్రుల్నేమిటి గిరీశాన్ని కూడా ఒక ఆట ఆడించి వుండనా?...

నా సంగతికేం కాని తమ కన్నీటితో కావ్యగౌరవం అందుకున్న నాయికలున్నారు. మనుచరిత్రలోని వరూధిని, వసు చరిత్రలోని గిరిక, పారిజాతాపహరణంలోని సత్యభామా అలాంటివారే వీరి ఏడుపులు ఆ ప్రబంధాలకే వన్నె తెచ్చాయని సాహిత్యపరులూ విమర్శకులూ కూడా జమిలిగా సంబరపడిపోయారు. పైపెచ్చు యీ కావ్య నాయికల ఏడుపులను కావ్యకర్తలకే అంటగట్టి - అల్లసానివారు అలా అలా ఏడిస్తే, ముక్కుతిమ్మన్న ముద్దు ముద్దుగా ఏడ్చాడు, భట్టుమూర్తి బావురమని ఏడ్చాడు - అన్నారు.

అప్సరస అయిన వరూధినికి మామూలు మనిషే అయినా ప్రవరాఖ్యుని అందం చూసేసరికి మా గిరీశం చెప్పేటట్లు - లవ్ ఎట్ ఫస్టు సైట్ - అయిపోతుంది. గిరీశం బుచ్చెమ్మను చూసి అనుకున్నట్లే -'' యేవి చక్కదనం... యీసొంపు యక్కడా చూళ్ళేదే. ఇన్నాళ్ళు ఊసుపోక యిబ్బంది పడ్డాను కాని పెద్ద కేంపేనుకి అవకాశం యిప్పుడన్నా దొరకటం నా అదృష్టమే .'' అనుకుంటుంది అందులోను చదువూ సంగీతాలు నేర్చి గిరీశం కంటె నాలుగాకులు ఎక్కువే చదువుకుంది కాబట్టి చాలా వయ్యారాలు వొలికిస్తుంది. ఎన్నో గడుసు పోకడలు పోతుంది. అసలు నాయకుణ్ణి చూడగానే - ''ఝుళం ఝుళిత్యట సూచితవేగ పదారవిందయై లేచి కుచంబులం దురువు లేనడుమల్లలనాడ-'' పూచిన ఒక పోక చెట్టుచాటున చేరి కళ్ళు విప్పార్చి చూస్తుంది. అసలు మరో మామూలు మగాడే అయితే ఆ మంచుకొండల బ్యాక్‌గ్రౌండ్‌లో ఆ చలిలో యీ వయ్యారానికే ముగ్ధుడైపోయి దాసోహంబనేవాడు. వరూధినిని కంటతడిపెట్టే దాకా రానిచ్చేవాడు కాడు. కాని పెద్దనగారు తను స్వతహాగా రసికుడే అయినా తన నాయకుణ్ణి మాత్రం పరమ జడుణ్ణీ ఛాందసుణ్ణీ చేసేశాడు. అందుకే ప్రవరుడి కీవిలాసాలూ వయ్యారాలు కళ్ళకు కనపడవు. పూజకు వేళయిందనీ అగ్నిహోత్రానికి టైమయి పోతుందనీ హడావుడి పడిపోతాడు. ఇహ యిదికాదు పనని చెప్పి వరూధినే చొరవతీసుకొని కౌగలించుకుంటే - హా శ్రీహరీ - అంటూ అంతటి అందగత్తెనూ తోసేస్తాడు ప్రవరుడు అప్పుడే కన్నీటి అస్త్రాన్ని ప్రయోగిస్తుంది వరూధిని. ''పాటున కింతులోర్తొరె కృపారహితాత్మక నీవు త్రోవ నిచ్చోట భవన్నఖాంకురము సోకె గనుంగొనుమంచు-'' ఆ పాటల గంధి వేదన నెపంతో ఏడుస్తుంది. ఎలాగనుకున్నారు - మామూలు ఆడవాళ్ళకు మల్లే కళ్ళు తుడుచుకుంటూ ముక్కు చీదుకుంటూ ఏడ్చిందనుకుంటున్నారా?

అలా ఏడిస్తే మొత్తం కథే రసాభాస అయిపోను. అప్సరసలూ శృంగార శాస్త్రాలు పఠించి మథించిన వాళ్ళూ అలా ఎందుకేడుస్తారు? కాబట్టే వరూధిని - ''కలస్వనంబుతో మీటిన విచ్చు గబ్బి చను మిట్టల నశ్రులు చిందువందగన్-'' ఏడుస్తుంది. ఈ ఏడుపు అసలు వేదనతో కూడిన ఏడుపు కాదు. ఎలాగయినా ప్రవరాఖ్యుణ్ణి వశపరచుకోవాలనే ఉద్దేశంతో ఏడ్చిన వయ్యారపు ఏడుపే కాబట్టి - అందాలు వొలకపోస్తూ, హొయిలు కురిపిస్తూ, విలాసాలు చిలికిస్తూ - అలా అలా ఏడుస్తుంది. పెద్దన గారికి - అల్లసాని వారు అలా అలా ఏడ్చారు - అని చిరకీర్తిని సంపాదించి పెట్టింది. ఎలా ఏడ్చినా వరూధిని కోరిక నెరవేరకపోవటమే విచారకరం.

ముక్కు తిమ్మనగారు సత్యభామతో ముద్దు ముద్దుగా ఏడ్పించారని పారిజాతాపహరణం చదివిన వాళ్ళంతా ముచ్చటపడిపోతూ చెప్పుకుంటారు. అసలు ఏడవటమే ఏడ్చినట్లుంటుందికదా! ఇహ అందులో ముద్దుగానూ ముచ్చటగానూ ఏడవటం ఏమిటి అంటే నేను చెప్పలేను కాని - తిమ్మన్నగారి సత్యభామ మాత్రం ముద్దుగా కాస్త షోగ్గా అదో పాటలానే ఏడ్చిందని చెప్పవచ్చు శ్రీకృష్ణుడు పారిజాత పుష్పాన్ని తనకు కాకుండా రుక్మిణికి యిచ్చాడని తెలియగానే సత్యభామకు కోపం రోషం ముంచుకొస్తాయి మారావప్ప పంతులు అనుకున్నట్లే - ''సొగసు కత్తెలకు అలకకూడా అదో శృంగారం సుమా-'' అనుకుంటూ శ్రీకృష్ణులవారు ఆమెను అనునయించటానికి వెళ్తే ఆ కోపంలో స్లైట్‌గా పాదప్రహారం కూడా ప్రసాదిస్తుంది. తర్వాత - ''ఈసున బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచేగాసిలి-'' ఏడ్చేస్తుంది అలా ఏడవటంలో కూడా తన వయ్యారానికీ వగలుకూ భంగం రాకుండా - ''శ్రీ సఖమైన మోము చేల చెరంగిడి-'' గొంతు శృతి సరిచేసుకొని అదో సంగీతంలా ఏడుస్తుంది. అసలు చెరగు మొహంమీద కప్పుకున్న తర్వాత ఆ చాటున ఏడ్చినా నవ్వినా ఎవరికి వైనంగా తెలుస్తుంది కనక? - అయినా నారదునికే సంగీతం నేర్పిన విద్వాంసురాలు కాబట్టి - ''బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకలకాకలీ ధ్వనిన్-'' ఏడ్చిందని కవిగారు వర్ణించారు లేత మామిడి చిగుళ్ళు తినగా కొంచెం వగరెక్కిన ఆడకోకిల కంఠం లాంటి కంఠంతో పాటలాగ ఏడ్చిందట. అంత ముద్దుగా ఏడవబట్టే శ్రీకృష్ణుడు కరిగిపోవటమే కాక ముగ్ధుడు కూడా అయిపోయి ఏకంగా పారిజాత వృక్షాన్నే పెకలించుకొచ్చి సత్యభామ పెరట్లోనే నాటతాడు ముద్దు ముద్దుగా ఏడ్చి తన ముద్దు చెల్లించుకున్న గడుసరి సత్యభామ ''ముద్దు పలుకుల తిమ్మన'' అని కవిగారికి మంచి పేరూ తెచ్చిపెట్టింది.

ఇహ భట్టుమూర్తి గారి గిరిక బావురుమని ఏడ్చిందంటారు అలా అనటానికి ఆస్కారం ఆయనే కల్పించారు గిరికతో ''యెల్గెత్తి'' ఏడ్పించి వసూ రాజును ప్రేమించి విరహంతో వేగిపోతున్న యీ ముగ్ధనాయిక వెన్నెలలు కురిపిస్తున్న చంద్రుణ్ణి చూసి సహించలేక పోతుంది అసలే విరహం ఆపై యీ వెన్నెల వేడి ఎలా తట్టుకోటం అనుకుంటూ బేల కాబట్టి బావురుమంటుంది. అలా ఏడవటంలో కూడా రిథమ్ మర్చిపోకుండా తాళం తప్పకుండా కాంభోజరాగం పలికిస్తున్న వీణవలె ఏడ్చిందిట ''యెల్గెత్తి ఆ రాజీవానన యేడ్చె కిన్నెర వధూ రాజత్యరాంభోజ కాంభోజ మేళ విపంచికా రవ సుధా పూరంబు తోరంబుగన్-'' అంటూ అమ్మడి ఏడుపును వర్ణిస్తారు కవిగారు రాగతాళ యుక్తంగా శృతిచేసిన వీణా నాదంలా ఏడ్చినందుకు గిరిక కోరికకూడా నెరవేరి ఆమె వసురాజునే వివాహమాడుతుంది. అయితే భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడన్న అపప్రధను మాత్రం కవిగారికి మిగిల్చింది.

ఈ వైనాలన్నీ ఎరగని అమాయికలు మామూలు మాటల్లోనే తమ బాధను వ్యక్తం చేస్తారు మామూలుగానే ఏడుస్తారు భాషా భేషజం లేకపోయినా ఆ మామూలు మాటలే, చేష్టలే హృదయానికి సన్నిహితంగా హత్తుకుంటాయి ప్రేమించిన ప్రియుడు చేరువకాక అసలు ఎప్పటికీ దగ్గరకాడేమోనన్న భయంతో - ''కంటికీ కాటుకబెట్టి కడవా చంకాను బెట్టీ కళ్ళనీళ్ళు కడవ నిండను కదరా చల్ మోహనరంగా-'' అంటూ ఓ పల్లెటూరి ముగ్ధ బాధపడుతుంది. ఈమె కన్నీటితో నిండిన కడవ ఎవరి మనసులనయినా కలుక్కుమనిపిస్తుంది.

ఇవన్నీ విరహాలు వియోగాలకు సంబంధించిన ఏడ్పులు కాని వాస్తవిక జీవితంలో యివేకాక యింకా అనేక విధాలయిన వత్తిడులకు వేదనలకు గురవుతున్నారు ఆడవాళ్ళు. చీటికీ మాటికీ కన్నీరు కార్చక తప్పటం లేదు వారికి భర్తలుగా ధాష్టీకం చెలాయిస్తూ భార్యలను ఏడ్పించటమే జీవితధ్యేయంగా ప్రవర్తించే మగమహారాజులు ఎంతమందో వున్నారు ''కలకంఠి కంట కన్నీరొలికిన సిరి యింటనుండ నొల్లదు-'' అంటూ పద్యాలు మగవాళ్ళే రాశారు కాని ఆ మాటలను పట్టించుకుంటున్న వారెందరు అనేదే సందేహం పద్యాల దోవ పద్యాలదే అయి ఆడవాళ్ళ కళ్ళనుంచి కన్నీరు వొలుకుతూనే వుంది అందుకే కాబోలు దేశంలో యింత దరిద్రం!...

